# స్టీల్ మాండ్ మేజిస్ట్రేట్

మాతృభూమి పేరు చెప్పి, నాగరికత విస్తరింప జేయడం అని వంకపెట్టి, నిజంగా తమనుతాము భ్రమలో పెట్టుకొని కొందరూ, కేవలం ఇతరులనుమాత్రం భ్రమలో పెట్టి స్వార్థమును కోరేవారు కొందరూ, మానవహృదయం-లోఉండే మధురమైనదానిని కాళ్లక్రింద వేసి నలిపేయ ప్రయత్నం చేస్తున్నారు. తమలోగాని ఇతరులలోగాని, గొప్పవారిలో గాని బీదవారిలోగాని, తమ దేశస్థులలోగాని ఇతర దేశస్థులలోగాని, విలువైనది విలువైనదే గనుక సంరక్షించ దగినది అని నమ్మి తమప్రాణాలనైనా ఇచ్చి కాపాడి ఉంచడానికి సిద్ధంగాఉండేవారుకూడా ఈ లోకంలో లేకపోలేదు.

ఈ రెండుతరహాల స్వభావాలుగల మనుష్యులలోఉండే వ్యత్యాసమూ, వారువారు చేయగల న్యాయాన్యాయాలూ, మనస్సును కరిగించే నాటకం రూపంగా మేతర్‌లింక్ మహాకవి ఈ పుస్తకంలో సూచించారు.

మేతర్‌లింక్ రవీంద్రనాథునివలె 'నోబెల్ ప్రైజ్' అనే బహుమానమును ౧౯౧౧-వ సంవత్సరాన్ని పొందారు.

విశ్వభారతి గ్రంథమాల-3

# స్టిల్ మాండ్ మేజస్ట్రేట్

Sthil maand meja stat



మారిస్ మేతర్ లింక్

1928

ప్రకాశకుడు:

కా. వైకుంఠరావు

323 తిరువత్యూర్ హైరోడ్డు

తండియార్ పేట

చెన్నపురి.



బెల్ జియమ్ దేశపుకవి, మేతర్ లింక్ ఫ్రెంచిభాషలో రాసిన 'బర్గోమాస్త్ర ద స్టిల్ మాండ్' అనే నాటకానికి తెలుగు.

ఫిబ్రేవరి 1928

వెల రు. 1-0-0



దొరుకుతావు:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, మద్రాసు. ఈ.

# పాత్రలు

స్టిల్‌మాండ్ మేజిస్ట్రేటు (మేజస్ట్రేట్)
ఇజెబెల్, (Isabelle) మేజిస్ట్రేటుగారి కుమార్తె
ఫ్లారిస్, ఆయన కుమారుడు
జర్మన్ మేజర్
లెఫ్టెనెంట్ ఆటో హిల్‌మర్, మజిస్ట్రేటుగారి అల్లుడు
లెఫ్టెనెంట్ షాన్‌బెర్గ్, రెండో జర్మన్ లెఫ్టెనెంట్
మేజిస్ట్రేటుగారి సెక్రెటరీ
క్లాస్, మేజిస్ట్రేటుగారి హెడ్‌తోటమాలి
జీన్ గిల్‌సన్
ఒక జర్మన్ సార్జంట్
ఒక జర్మన్ సిపాయి

['ఇజెబెల్'లో 'జె' ఇంగ్లీషు 'Z' మోస్తరు ఉచ్చారణ]

రవీంద్రనాథ్ ఠాకూర్ గారికి ఇచ్చిన 'నోబెల్ ప్రైజ్' అనే బహుమానమే 1911'వ సంవత్సరంలో మేతర్ లింక్ గారికి ఇచ్చారు.

# స్టిల్‌మాండ్ మేజస్ట్రేట్

## ఒకటో అంకం

(మేజస్ట్రీటుగారు పనిచేసుకొనే గది—మొదటి అంతస్తులోని గదులలో ఒకటి—విశాలమయినది, కులాసాగా కూర్చోడానికి తగిన ఉపకరణాలు గలది. కొంత భాగము కచేరీ పని కింద ఉపయోగం అవుతూ ఉన్నది. మిగిలిన భాగంలో పూలమొక్కలకూ తోటలకూ సంబంధించిన పరిశోధనకు వీలైన ఏర్పాట్లు చేసిఉన్నవి. ఇందులో మెత్తాలు వేసిన పడక కుర్చీలూ, పుస్తకాలు పెట్టుకొనే అద్దాలబీరువా ఉన్నవి. ఒక పక్కను పెద్ద మేజాబల్ల—ఆ బల్లనిండా ఎక్కడ చూసినా కాగితాలూ, ఫ్లవర్ దానలూ; పళ్లతోనూ పూలతోనూ నిండి ఉన్న పళ్లేలూ, బుట్టలూ. ఆ పళ్లేలలో నానా రకాల రేగుపళ్లూ, బేరికాయలూ, అంజూర్ పళ్లూ, ఆపిల్సూ, ద్రాక్షపళ్ల గుత్తులూ. నాలుగు మూలల్లో సీసాలూ, కల్వాలూ, గాజుగిన్నెలూ, తోటపని చేసే సామానులూ. ఒకమూల పెద్ద స్టాండుగడియారం, ఘంటలు కొట్టేది. వెనక పెద్ద కిటికీ, తెరిస్తే డాబా కనబడుతూ ఉంటుంది. కుడిపక్కను ఒక దుక్క తలుపు.

తెర ఎత్తేసరికి మేజస్ట్రీటుగారి సెక్రటరీ మేజామీద ఒకమూలను వ్రాసుకుంటూ కూర్చున్నాడు. జీన్ గిల్సన్ కాపువాళ్ల తోడుక్కుండే

అమిరీఅమరని బట్టలతో ఉడివేపు ప్రవేశం. అతని చెయ్యి కట్టు కట్టి స్లింగ్‌లో మెడనుంచి వేలబడుతూ ఉంది.)

జీన్ గిల్సన్

నమస్కారమండీ, సెక్రటరీ గారూ.

సెక్రటరీ

నమస్కారం, ఏమి కావాలి మీకు?

జీన్ గిల్సన్

(మరి కొంచెం దగ్గరగా వచ్చి) నన్ను పోల్చుకో లేదు కాబోలు; చాలా రోజులయింది చూసి, మరిచి పోయి నట్టున్నారు.

సెక్రటరీ

నువ్వా! క్షమించు జీన్! నువ్వు వస్తావని ఏలాగు అనుకోగలను? ఎక్కడనుండి వస్తున్నావు? ...అయ్యయ్యో ఇదేమిటి దెబ్బ తగలిందే!

జీన్ గిల్సన్

అవును, దండలోనుంచి గుండు వెళిపోయింది—ఏర్ పాత్ దగ్గిర ఊరవతల తగిలింది. నన్ను వింకిల్‌లో ఉన్న ఆసుపత్రికి పంపించేశారు. జర్మన్‌లు ఆవూళ్లో ప్రవేశించారు నిన్నను. నడిచేపాటి బలం ఉండబట్టి ఖైదీగా

వాళ్లకు ఎందుకు దొరికి పోవడం అని పారిపోవచ్చాను. ఈ బట్టలు ఎక్కడో సంపాదించి తప్పించుకొని పైకి వచ్చి కొంతసేపు రోడ్డుపక్కను ఏదో ఒక కాలువలో దాగొని, నాటు దారిని మూడు ఘంటలు నడిచి ఇప్పటికి వచ్చాను ఇక్కడికి, స్త్రీల్‌మాందుకు. గాని ఇక్కడైనా సావకాశంగా కూర్చోడానికి వీలులేదు; తక్షణం పరుగెత్తుకొని వెళ్లి మా గుర్రపు దళాన్ని కలుసుకోవాలి; వాళ్లు ఈపాటికి ఓవర్‌లూప్ ఆ ప్రాంతాలకు వెళ్లి ఉంటారు.

సెక్రటరీ

అలిసి పోయినట్టు కనబడుతున్నావు. దండ బాధ పెడుతూ ఉంది కాబోలు. చూడు బట్టలన్నీ ఏలాగు తడిసి ముద్దఅయిపోయినాయో!

జీన్ గిల్సన్

బట్టలు తడిసిపోయినాయి నిజమే...గాని చెయ్యి మాత్రం అంత బాధగా లేదు—కాదు కాదు, అన్నట్టు బాధలేక పోవడం లేదు, ఇంతకు ముందు లేదుగాని ఇప్పుడు చాలా బాధగానే ఉంది, ఎందుచేతనో గాని.

సెక్రటరీ

చాలా అలిసిపోయినావు కదూ, అందుచేత అయి ఉంటుంది. కొంచం బడలిక తీర్చుకొని దెబ్బసంగతి చూ

సుకో. నీకు పడుకోడానికి జాగా ఏర్పాటు చేస్తాను— మాయింట్లోనో లేకపోతే ఇక్కడో—ఇక్కడా అంటే సాక్షాత్ భగవంతుడి ఇల్లు అన్నమాటే కదా!

జీన్ గిల్సన్

పడక సంగతీ ఆయాసం సంగతీ చూసుకొనే సమయం కాదు ఇది. తెల్లవారేసరికి వచ్చిపడతారు, వాళ్లు.

సెక్రిటరీ

ఎవరు ?

జీన్ గిల్సన్

మరెవరు! జర్మన్‌లు ! దారిపొడగునా ఎక్కడచూసినా వాళ్ల సిపాయిలే—సేనకు ముందుగా వస్తారూ, వాళ్లూ. వాళ్ల సైన్యం కూడా అట్టే దూరంలో ఉండదు.

సెక్రిటరీ

అబ్బె, వట్టిమాట! వాళ్లసంగతి మేము విననైనా విన లేదే! గాని, అన్నట్టు, వచ్చిపోయే దారులన్నీ అటకాయింపు అయిపోయినాయి; టెలిగ్రాములూ, ఉత్తరాలూ రావడంగాని పోవడంగాని లేదు.

జీన్ గిల్సన్

మేస్త్రీటుగారు ఎక్కడ !

సెక్రటరీ

నేనూ అతని కోసమే కనిపెట్టుకొనిఉన్నాను. పూల మొక్కల అద్దాల ఇళ్ళల్లో ఎక్కడో ఉంటారు. నిన్న రాత్రి తుపానువల్ల చాలా నష్టం కలిగినట్టుంది. ఇప్పుడే వస్తారు. మనిషికూడా వెళ్ళాడు. మాట్లాడతావా ఏమిటి?

జీన్ గిల్సన్

వింకిల్ మే'స్త్రీటుగారు అతిజాగ్రత్తగా ఉండవలసిందని చెప్పమన్నారు. అంతకంటే ముఖ్యంగా ఆయన సలహా ఏమిటంటే ఎటువంటి ఆయుధాలూ ఊళ్లో ఉండకుండా చేయవలసింది అని.

సెక్రటరీ

ఆ బందోబస్తు అంతా అయింది. చెయ్యవలసినదంతా చేశాము. ఆయుధాలూ, బహుమానంగా వచ్చిన గిన్నెలూ మొదలయిన మంచి వింత వింత వస్తువులూ, అన్నీ టౌన్‌హాల్‌లో ఒక గదిలో పెట్టి తాళం వేసేశాము; ఆ తాళం నా దగ్గిరే ఉంది...ఆహా! వాళ్లు వింకిల్ దగ్గిరా ఉన్నారు!

జీన్ గిల్సన్

అవును మూడు నాలుగు వందలమంది ఉంటారు. మన మే'స్త్రీటుగారి అల్లుడే వాళ్ల లెఫ్టెనెంట్ అట.

సెక్రటరీ

మే'స్ట్రీటుగారా! ఏ మే'స్ట్రీటు!

జీన్ గిల్సన్

మీ మే'స్ట్రీటుగారు, స్టిల్‌మాంద్ మే'స్ట్రీటు!

సెక్రటరీ

'ఆటో హిల్మరా? అబ్బె, ఉత్త మాట.

జీన్ గిల్సన్

అవును అతనే; నేను విన్నది ఆ పేరే: లెఫ్టెనెంట్ హిల్మర్...ఉహ్ హూ! నేను విన్నది నిజమన్న మాటే అయితే. నేను ఒకంతట నమ్మలేదు. మే'స్ట్రీటుగారి కూతురు జర్మన్‌ను పెళ్లాడిందా!

సెక్రటరీ

పెళ్లాడింది, అందులో తప్పేముంది. జర్మన్‌లకూ మనకూ అట్టే సఖ్యం ఉండేది కాదు గాని, మనకేమి హాని చేశారు వాళ్లు? హాని లేదుకదా పైగా...పోనీ అదంతా ఎందుకు ఇప్పుడు—అది యుద్ధానికి ముందు చాలాకాలం నాటి కథ. ఇదంతా ఎవరు అనుకోగలరు అప్పుడు. మన మే'స్ట్రీటుగారి భార్య, పెళ్లికి ఒకసంవత్సరం ముందుగానే

చచ్చిపోయింది—అదీ మన అదృష్టమే! ఆమె బ్రతికి ఉంటే ఈ పెళ్లి ఎంతమాత్రం జరిగి ఉండదు—ప్రవ్యా దేశస్థులంటే ఆమెకుండే అసహ్యం ఇంతా అంతా కాదు. ఇప్పుడు వాళ్లు చేస్తూఉండే ఘోర కృత్యాలన్నీ చూస్తే ఆమెకు ఏలాగుంటుందో మరి చెప్పనక్కర లేదు. మే'స్త్రీటుగారికైనా వినగానే గుండె గుభీ మంటుంది. లెఫ్టెనెంట్ ఆటో ఇక్కడకు వచ్చేటట్టుగా ఉందా ఏమిటి?

జీన్ గిల్సన్

ఏమీ సందేహం లేదు. వింకిల్ మే'స్త్రీటుతో చెప్పిన దాన్నిబట్టి చూస్తేమాత్రం వస్తాడన్న మాటే!...కాని ఆ పెళ్లి ఏలా తటస్థించింది?

సెక్రిటరీ

అన్ని పెళ్లిళ్లమోస్తరే. ఎవరనుకోగలరు, ఏదో ఒక మంచి ముహూర్తాన వచ్చి జర్మన్‌లు మనసందరినీ చంపుతా రని, ఈ ఘోర కృత్యాలన్నీ చేస్తారని—మనము వింటూ ఉన్నవన్నీ నిజమయితే సుమీ!

జీన్ గిల్సన్

నిజం కాకేమి! వాళ్లు చేసేపనులలో మీారు విన్నవి ఒక ఘోరం కింద లెక్కే కాదు!

సెక్రటరీ

ఎంత ఘోరం, ఎంత ఘోరం! ...కాని ఎవరనుకో గలరు ఈలాగు అవుతుందని...జరిగిన సంగతేమిటో తెలుసునా—మన మేజ్‌స్ట్రేటుగారు వర్తకం సందర్భంలో తరుచుగా జర్మనీ వెళుతూ ఉండేవారు. అక్కడివాళ్లు ఈయన అంటే ఒక రాజుకు చేయవలసిన మర్యాదా చేస్తూ ఉండేవారు. కొలోన్‌లో ఉండే హార్టికల్చురల్ సొసయిటీలన్నిటికీ ప్రెసిడెంటుగా ఎంచుకున్నారు ఈయనను. హిల్మర్ కుటుంబంతో ఆయనకు చాలా కాలంనుంచీ పరిచయం. కొలోన్ వెళ్లినప్పుడల్లా ఆటోగారి ఇంట్లోనే ఆయన బస.

జీన్ గిల్సన్

మంచి స్థితిపరులేనా ఆ హిల్—ఏమిటన్నావు ఆ పేరు—హిల్—హిల్—

సెక్రటరీ

హిల్మర్. రైన్ మండలంలో ఒక ఫ్యాక్టరీ ఉంది వాళ్లకు, ఎలక్ట్రిక్ యంత్రాలుచేసే ఫ్యాక్టరీ, అక్కడ ఉండే అన్నిటిలోకీ పెద్దది. అయితే, ఏమిజరిగిందంటే—హిల్మ-ర్ల అబ్బాయికి—అవగా ఇప్పటి ఉద్యోగం ప్రకారం లెఫ్టెనెంట్ హిల్మర్‌కు పళ్లజాతులు, అందులో ముఖ్యం

గా పెద్దజాతి తియ్యని ద్రాక్షపళ్లు, పండించే విధం నేర్చు కోవాలని చాలా సరదాగా ఉండేది. మన మేస్ట్రీటుగారి కంపెనీ—వాన్‌బెల్ కంపెనీ—ఆజాతిపళ్లకు పేరుపడి ఉండెను. మరి, మేస్ట్రీటుగారి కొడుకుకి ఎలక్ట్రిసిటీ నేర్చుకుందామని అతి అభిలాషగా ఉండేది. ఇక నేమి, రెంటికీ రెండూ సరిపోయాయి—మనవాళ్ల అబ్బాయి కొలోన్ వెళ్లాడు, వాళ్ల అబ్బాయి, ఆటో, ఇక్కడికి వచ్చాడు.

జీన్ గిల్సన్

ఇదంతా ఎన్నాళ్ల కిందటి మాట ?

సెక్రిటరీ

సుమారు రెండు సంవత్సరాలు అవుతుంది ఇప్పటికి.

జీన్ గిల్సన్

మన మేస్ట్రీటుగారి కొడుకు, వాన్‌బెల్, ఎక్కడున్నాడు ఇప్పుడు ?

సెక్రిటరీ

యుద్ధం నిశ్చయమయినట్టు ప్రచురణ అయేసరికి కొలోన్‌లోనే ఉండెను. గాని ఏలాగో తప్పించుకు సారి

పోచ్చాడని వింటున్నాము. నిజం ఇప్పటికీ తెలియదు, అతిజడుస్తూ ఉన్నాము.

జీన్ గిల్సన్

వాళ్ల అబ్బాయి, అయితేమరి, ఏలాగు వెళిపోయి నాడు?

సెక్రిటరీ

ఏమో! ఏలాగోగాని అతనికి మాత్రం యుద్ధం మాట తెలిసి ఉండాలి. జూలై ఆఖరున ఒకనాడు వెళ్లిపోయి నాడు, వెళుతున్నప్పుడు తల్లికి జబ్బు అని చెప్పి వెళ్లాడు.

జీన్ గిల్సన్

దానివల్ల స్పష్టమవుతూ ఉంది, జరగబోయే దేదో వాళ్లకు తెలుసుననిన్ని, దానికోసం సిద్ధపడుతున్నా రనిన్ని. వెళ్లినవాడు వెళ్లాడు సరే—తనవాళ్లు తనకు ముందుగా రహస్యం తెలియజేసినట్టుగా తానుకూడా తన మామగారికి చెప్పనక్కర లేదూ? పోనీ మామ గారికి చెప్పలేదు, సరే; శత్రు దేశంలో ఉన్నాడు కదా, తన భార్య తమ్ముడితోనైనా చెప్పనక్కర లేదా— ధర్మపే!

సెక్రటరి

మన మోస్తరు కారు వాళ్లు—తెలియడం లేదూ!

జీన్ గిల్సన్

మనం వాళ్ల మోస్తరు కాము అను జీన్—పోనీ, అది సంతోషమయిన మాటే... పెళ్లి అయి ఎంతకాలం అయింది?

సెక్రటరీ

ఆరు నెలలు కావచ్చింది.

జీన్ గిల్సన్

ఏమైనా సుఖంగా ఉన్నారా?

సెక్రటరీ

ఒకరి నొకరు పూజించుకుంటూ ఉండేవారు—నిజం చెప్పాలి కదూ. ఆటో చాలా సరదా అయిన మనిషి, మనస్సు మంచిది; అతి దయగలవాఁడు; ఒకరికి ఉపకారం అంటే చాలా సంతోషంగా చేస్తాడు; కష్టపడి పనిచేసే వాఁడు; చురుకైన మనిషి—చురుకంటే అతిచురుకు. నిజాన్నిపట్టి చూస్తే అనుకోడానికి అతనిమీద ఏమీ లేదు..

జీన్ గిల్సన్

జర్మన్ అని తప్ప—అది చాలదూ!...పాపం అతని పెళ్లానికి ఏలాగుంటుందో ఇదంతా చూస్తూ ఉంటే.

సెక్రటరీ

అంతా తల్లకిందులు అయిపోయిందా అనిపిస్తూ ఉంది—మతిపోయినట్టుగా ఉంది. ఇదంతా ప్రమాదానికే వచ్చింది--ఆమె ఇప్పుడు...నువ్వు వినే ఉంటావు.... బాగా నిశ్చయం కాలేదనుకో...చికాకుగా ఉంటుంది ఎప్పుడూ, మనస్సులో ఏదో విచారంగా ఉన్నట్టు. పైకేమీ చెప్పదు—సహజంగా అట్టే చెప్పే మనిషి కాదు— ఇప్పుడు మరి అడగక్కరేలేదు.

జీన్ గిల్సన్

అతను ఆమెతో అంతా ముందుగా చెప్పి సిద్ధపరిచి ఉండాలికదూ?...ఆమెకు తెలిసి ఉంటుంది జరుగుతూ ఉన్నదంతా—కదూ?

సెక్రటరీ

నాకు అదేమి తెలియదు;రహస్యాలేవీ నాతో చెప్పదు.

జీన్ గిల్సన్

మేజ్స్ట్రేటుగారు ఏమంటున్నారు?

సెక్రటరీ

అతి చికాకు పడుతూ ఉన్నారు. మొట్ట మొదట మతి పోయినట్లయిపోయినారు; ఏమైనా సరే నమ్మనేశారు, అంతే. కాని కొద్ది రోజులలోనే కోపం వచ్చింది; భయంకరమైన రౌద్రంతో మతి పోయింది. మరి రెండు రోజులు కాగానే మనస్సు కొంచం కుదట పడ్డది, ఏది వచ్చినా మన మంచికే అనే తత్వం, చూడు, ఆయనది. అందుచేత ఇక నాలుగు రోజులలో అంతా చక్కపడి పోతుంది అని అనుకుంటున్నారు ఇప్పుడు. ఇదుగో వస్తు న్నారు. (బహుమతీ పొందిన ఒక గొప్పజాతి ద్రాక్షపళ్ల గుత్తు చేతిలో పట్టుకొని మే'స్త్రీటుగారు ప్రవేశం; సెక్రటరీలేచి) నమస్కారం.

మే'స్త్రీటు

నమస్కారం, పియర్, ఏమి సమాచారం. కులాసాగా ఉన్నావా?

సెక్రటరీ

కులాసావే—రాత్రిఅంతా కూర్చొని పనిచేసిన తరువాత ఎంత కులాసాగా ఉండాలో అంత కులాసా.

మే'స్త్రీటు

టౌన్ హాల్ లో ఆ ఏర్పాటంతా అయిపోయిందా?

సెక్రిటరీ

ఆహా; కత్తులూ, తుపాకులూ అవన్నీ అక్కడ పెట్టిం చేశాను. పట్టీ నేనే రాసి వాళ్ళ వాళ్ళ రసీదులు ఇచ్చే శాను...ఇదుగో ఈయన మీకు తెలుసునా, జీన్ గిల్సన్, మే మిద్దరం పాతస్నేహితులము. ఏర్ పాత్ దగ్గిర దెబ్బ తగిలిందట. నిన్న జర్మన్లు వింకిల్ లో ప్రవేశించేసరికి ఆ ఊరి ఆసుపత్రిలో ఉండెనట, ఎలాగో రాత్రి మెల్లిగా తప్పించుకుపారిపో వచ్చాడట.

మే'స్త్రీటు

(గిల్సన్ చెయ్యి పట్టుకొని) ఓహో, అయితే నువ్వు ఏర్ పాత్ దగ్గిర ఉన్నావా?

జీన్ గిల్సన్

ఔను, వెనుకకుతగ్గిపోతూ ఉన్న మన సైన్యానికి కాపుగా ఉంచిన సిపాయిల దళానికి సార్జంటుగా ఉన్నాను.

మే'స్త్రీటు

'యుద్ధమంటూ విస్తారం జరిగిందా ఏమిటి?

జీన్ గిల్సన్

ఆహా, మనవాళ్లలో గాయాలు తగిలినవాళ్లూ చచ్చిపోయినవాళ్లూ కలిపి నూటికి అరవయ్యైమందికి తక్కువ ఉండరు. వాళ్ల సిపాయిలసంఖ్య చాలావిస్తారం, మేము ఒకర్రైతే వాళ్లు ముగ్గురు; పైగా మాదగ్గిర తుపాకులేమీ లేవు. సాధ్యమయినంత సేపు నిలబడ్డాము; మరి ఇక ప్రయోజనం లేదు అని స్పష్టం ఎప్పుడు అయిపోయిందో వెనకకు తగ్గడం ఆరంభించాము.

మే' స్త్రీటు

చాలా ఆయాసపడిఉన్నట్టున్నావు. భోజనంకూడా లేదు కాబోలు పాపం! ఏమబ్బాయి పియర్, మంచివాడవే! ఆయనకు కావలసినదంతా...(బంట్రోతుకోసం బెల్ నొక్కుతూ) సరేలే, నేనే చెప్తాను. (నౌకరు ప్రవేశం) ఫర్మిన్, చూడు, వీరికి భోజనసదుపాయం త్వరగా చేయించాలి. కిందికి వెళ్లి ఏదుంటే అది తీసుకు రమ్మని చెప్పు.

నౌకరు

ఏదో కొంత వంట అయింది.

మేస్త్రీటు

సరే ఏదుంటే అదే తీసుకు రమ్మను. చూడు, మరి భోజనంఅప్పుడు తాగడానికి ఏమిటి తీసుకు రమ్మంటావు? (గిల్సన్ వేపు చూసి) ఏది తెప్పించుమంటారు? ప్రశస్థమైన "రుది శ్రైమర్" మార్క్వది ఉంది, నెం 82 రు "పోర్టు" ఉంది—ఆ పోర్టు కూడా మీరు చాలా ఇష్టపడతారు, నాకు తెలుసును. అదికాదు, (నౌకరు వేపు తిరిగి) చూడు, రెండూ కూడా తీసుకొనిరండి, అది అన్నిటికంటే నయం. (జీన్‌తో) రెండుబుడ్లు జాస్తీ అయిపోవు కదూ! అవసరం ఉంటే మనముకూడా సహాయం చేదాము— ఏమం టావు సెక్రిటరీగారూ? మనం కొన్ని ఖర్చుపెట్టేయ గలిగితే జర్మన్‌లకు దొరికేవైనా కొంచెం తగ్గుతా యి...కావలసినన్ని పళ్లు కూడా ఉన్నాయి, గుత్తులు గుత్తులు కనబడుతూనే ఉన్నాయి. ఈ ఆపిలూ, బేరి కాయలూ, రేగిపళ్లూ—అన్నీ నేను పెంచి పండించినవే. ఇదుగో ఇప్పుడు తీసుకు వచ్చాను, ఈ ద్రాక్షపళ్లు, చూడండి—దీనితో సమానమైనవి ఇంకెక్కడైనా చూశారూ? ఇది కేవలం నా ప్రయత్నం వల్ల సాధించిన జాతి, ఇంకెక్కడా ఉండదనుకుంటాను. ఇది రెండు జాతులవల్ల అయిన అంటు—అందులో ఒకటి రుచి

తక్కువది, గాని చూడడానికి అతి ఇంపుగా ఉంటుంది, నల్లగాను పెద్దదిగాను. రెండోది, చిన్నది, రుచికి అతి మధురం, సిసిలీ నుంచి తెచ్చిన జాతి. ఎంతో ఓపికతో మెల్లి మెల్లిగా అంట్లు కట్టుకు వచ్చి, చివరకు రెండింట్లో ఉండే మంచి మాత్రం ఉంచి, మంచిది కానిది లేకుండా చెయ్యగలిగాను. కొంచెం తినిచూడండి ఇంతమ్మంచివి ఇంకెక్కడైనా చూశారూ? గట్టిగా ఉంటాయిగాని నిండా రసమే,నోట్లో పెట్టుకోని ఈలాగు అనేసరికి కరిగిపోతాయి —మంచుతో కలిసిన చక్కని ద్రాక్షరసం రుచి వస్తుంది. నాలుగైదు సంవత్సరాలు అయేసరికి నాలుగేసి వేల రూపాయలకు తక్కువలేకుండా ఖరీదు చేసే పళ్లు ప్రతి వారం పండించగలను. రుచి చూడడం మొదట మీరే. ఆహా, ఏమన్నారు...జర్మన్‌లు, అయితే, వింకిల్ దాకా వచ్చేశారూ ?

జీన్ గిల్సన్

అవును. ఈ ఉదయమే ఇక్కడకు వచ్చి ప్రవేశిస్తారు. వాళ్లకంటే నేను అట్టే ముందు అయి ఉండను.

సెక్రటరీ

మీ అల్లుడు ఆటో దానికి పెద్ద అట, జీన్ చెప్తున్నాడు.

మేజిస్ట్రేటు

ఎవరూ, ఆటోవా ? పిచ్చిమాట ! ఎవరుగాని అన్నారా ఏమిటి అలాగని? మీరు చూశారా ?

జీన్ గిల్సన్

నేను చూడ లేదు గాని, అలా అని విన్నాను. విం కిల్ కి వచ్చినవాళ్లలో పెద్దవాళ్లు ముగ్గురట, ఒక మేజరూ ఇద్దరు లెఫ్టెనెంటులూ. ఆటో హిల్మర్ అందులో ఒకడు. నెం 62 రు పటాలంతో వచ్చి ఈ ఊరు ఆక్ర మిస్తాడని తనే అన్నట్టు విన్నాను.

మేజిస్ట్రేటు

నిజమే కాబోలు అయితే...అవును, అతను అప్పుడే రిజర్వ్(సైన్యం)లో లెఫ్టెనెంటుగా ఉండేవాడు అతను ఈలాంటి సాహసం చెయ్యడం చాలా అసందర్భంగా ఉంటుందే!... లేదు లేదు అతను చేసినదానిలో తప్పులే-దేమో చివరకు.అవును...అవును. చాలా మంచి పనే; మనకు అనుకూలంగా అన్ని ఏర్పాట్లూ అవుతాయి. మనము భయపడ నవసరం ఉండదు...అదంతా నిజమేగాని విపరీతంగా మాత్రం కనబడు తుంది. తనకు రెండో జన్మభూమి అయిన మనదేశంలోకి, హద్దులు దాటివచ్చి వర తీసిన కత్తి

చేతపుచ్చుకొని నా అల్లుడు నేను అధికారిగా ఉన్న ఊరికే వచ్చి నన్ను జయించడం అనేది—గాని జరుగుతున్నది యుద్ధం కదా, ఆమాట మరిచి పోకూడదు. ఆపని అతను చేయక తప్పదు. దాని నింద అతనిది కాదు, తన ఇష్టం వచ్చినట్లు చేయగలడా మరి! అంతేకాదు, మనకు ఇది మంచిదే అంటాను; అతను ఉన్నంతసేపు మనకు ఎటువంటి హానీ కలగదు...వింకిల్‌లో ఏలాగుంది వాళ్ల ప్రవర్తన, అట్టే పాడు పనులేవీ చెయ్యలేదు కదూ?

జీన్ గిల్సన్

నే నా ఊరు విడిచిపెట్టే సరికి ఏమీ చెయ్యలేదు. మే'స్త్రీటుగారినీ తక్కిన ఇద్దరు పెద్ద ఉద్యోగస్థులనూ మట్టుకు జామీనుగా ఉంచారు. ఊళ్లో గుండు శబ్దం గాని వినబడ్డదా అంటే వాళ్ల ముగ్గురినీ చంపేస్తామని చాటించారు.

మే'స్త్రీటు

ఇక్కడ అటువంటి పని ఏదీ చెయ్యరు ఆటో ధర్మాన ఆటోది చాలా దయగల మనస్సు—పిట్టకైనా హాని చెయ్యలేదు ఆటో. ఇంతది అంతగా చెప్తారుగాని వాళ్లు చేస్తున్నారని విన్న హత్యలూ ఘోరాలూ నిజం కావు; వాళ్లు మాత్రం వట్టి కిరాతులు కారు కథా!

జీన్ గిల్సన్

అదిమాత్రం నేను ఒప్పుకో లేను సుమండీ—అన్నం దుకు క్షమించండి. మనము విన్నవి ఇంతవి అంతగా చెప్పిన మాటలేవీ కావు. అంతేకాదు, జరుగుతున్న దంతా మనకింకా తెలిసి ఉండదని నానమ్మకం. ఆన్‌దేన్ లోనూ, దినాన్‌లోనూ, లవైన్‌లోనూ — ఎక్కడికి వెళితే అక్కడ, వాళ్లు చేస్తూఉన్న పనులు చూస్తే గుండె బద్దలైపోతుంది కదూ! లవైన్‌లో దినాన్‌లో వాళ్లు చేసిన హత్యల మాట చూసనవాళ్ల దగ్గిర విన్నాను —నా మనుష్యులిద్దరు కళ్లతో చూశారు. లవైన్‌లో ఏమీ అపరాధం ఎరగని వాళ్లను రెండు వందల పది మందిని పట్టుకొని చంపేశారు, అందులో ఆడవాళ్లు ఇరవై నలుగురు, పసి పిల్లలు పదహారుగురు; దినాన్‌లో ఆరువందల ఆరుగురు, అందులో పిల్లలు ముప్పైతొమ్మండు గురు, ఆడవాళ్లు డబ్భైఇద్దరు; ఏర్‌షాత్‌లో మేస్త్రీటు గారిని చంపేశారు, పదిహేనేళ్ల కొడుకుని చంపేశారు— ఇంకెంతోమంది నిరపరాధులనూ నిరాయుధులనూ చంపే శారు.

మేస్త్రీటు

అయితే నిజమే! విచారణ ఏదీ లేకుండా ఇష్టం

వచ్చిన వాళ్లందరినీ చంపుతున్నారన్న మాట నిజమే? వాళ్లు ఆలాగు చేసినందుకు చెప్పిన నెప మేమిటి కదా?

జీన్ గిల్సన్

జరిగిన దేమి టంటే—ఎవడో వాళ్ల మనిషి ఒకడు దేనినో తుపాకీతో కొడుతూ ఉంటే ఆ గుండు తగిలి వాళ్ల కర్నల్ చచ్చిపోయినాడు.

మేజిస్ట్రేటు

రాక్షసబృదం లాగుందే! అతి దుర్మార్గులన్న మాట—ఇక్కడ మాత్రం అటువంటి పనేదీ జరగకూడదు. (నౌకరు ప్రవేశం.) ఇదుగో ఫర్మిన్ వచ్చాడు, అన్నీ తీసుకొని. (గ్లాసులు వైన్‌తో నింపి) ఇది నెం 9 రు రుదిషైమర్ మార్కు. ఏలాగుంటుందో చూడండి.

జీన్ గిల్సన్

(రుచిచూస్తూ) వహ్వా, చాలా బాగుంది.

మేజిస్ట్రేటు

అవును, అది చాలామంచి రకం. (నౌకరు వెళ్లిపోతాడు) గవర్నమెంటు ప్లీడరు వేయించిన వేలాంలో యాభై డజన్ల బుడ్లు కొన్నాను. అందులోది ఇది. ఈ ప్రాంతాల్లో అంత బాగా నిలవచేసే వాళ్లు ఇంకెవరూ

ఉండేవారు కారు...అయితే, మీరిప్పుడు ఏమి చేస్తా నంటారు? ఈ స్థితిలో మాత్రం వెళ్ల నివ్వను, మీ ఇష్టం, చూసుకోండి. కొద్ది రోజులైనా ఇక్కడ ఉండండి, మీ దెబ్బకు కట్టు కట్టిస్తాను, కొంచెం సుళువయిన తరవాత కావలస్తే వెళ్లవచ్చును. అశ్రద్ధచేస్తే ప్రమాదం అయే మోస్తర్హు సుమండీ ఆ దెబ్బ.

జీన్ గిల్సన్

నా మాట వినండి—నేను గాని వాళ్లకు దొరికానా అంటే తప్పించుకు పారిపోవచ్చానని నన్ను చంపేస్తారు, లేదా ఖైదీగా జర్మనీ తీసుకుపోతారు.

మేస్త్రీటు

ఆ భయం పెట్టుకోకండి. ఈ ఇంట్లోనే దాచేస్తాను. ఆటోతో చెప్తాను, అతను తగిన ఏర్పాటు చేస్తాడు.

జీన్ గిల్సన్

అంతకంటే కావలసిన దేమిటి? చాలా అలిసి పోయి ఉన్నాను. మరి అట్టే దూరం నడవడానికి బలం లేదు. గాని నేనుమాత్రం మీ ఇంట్లో కనబడ్డానా అంటే మీరూ నేనూ ఒకటే అని మీకు చిక్కువస్తుంది.

మే’ స్ట్రీటు

నేను ధైర్యంగా చెప్పగలను, అటువంటి భయం ఏమీ లేదు, నా మాట వినండి. నేను ఏది అడిగినా ఆటో లేదనలేదు. ఈ ఏర్పాట్లన్నీ మాలో మేము ఏలాగు చేసుకుంటామో చూస్తూ ఉందురూ.

(నౌకరు ప్రవేశం)

నౌకరు

వాళ్లు గేట్ దగ్గిరికి వచ్చి ఉన్నారు.

మే’ స్ట్రీటు

ఎవరా వారు?

నౌకరు

జర్మన్‌లు—ఒకడజేన్ మంది ఉంటారు. సిపాయిలు కాక ఇద్దరు పెద్ద ఉద్యోగస్తులు ఉన్నారు. లోపలికి విడిచి పెట్టేదా?

మే’ స్ట్రీటు

ఓ, ప్రశస్తంగా; అందరినీ లోపలికి వదులు. ఆ పెద్ద వాళ్లను మాత్రం మీదికి తీసుకురా, నేనిక్కడే ఉంటాను.

సెక్రిటరీ

నేను వెళిపోయేదా ?

మే'స్ట్రీటు

అబ్బే ఫరవా లేదు, ఉండు. గాని ముందు నీ స్నేహితుడు ఎక్కడో సురక్షితంగా ఉండేటట్టు చూడు. ప్రస్తుతం పక్కగదిలోకి తీసుకు వెళ్లు, తరవాత ఫర్మిన్ వచ్చాక నెమ్మదిగా పడుకోడానికి వీలయేటట్టు జాగా ఏర్పాటు చేదాము. గిల్సన్‌గారూ, ఇప్పటిమట్టుకు సెలవు; ఈ భోజనంఅంతా మీతో పట్టించుకువెళ్లండి. మీరు మరేమీ భయపడకండి. (జీన్ పక్కగదిలోకి వెళతాడు.) శత్రువు ఇక్కడనే మనను ఎదిరిస్తాడన్నమాట; మాట్లాడడానికి సిద్ధంగా ఉండాలన్నమాట. అదుగో మెట్లమీద కత్తుల చప్పుడు. (ముందు నౌకరు, వెనక మేజర్, ఆటో, కర్నల్ ప్రవేశం.) ఇదుగో ఆటోవ !

(మామూలు మోస్తరుగా వీపుమీద చెయ్యి వెయ్యబోతూ తిరిగి వెనక్కు తీసుకుంటాడు)

ఆటో

అవును నేనే (మేజర్ వేపు మొఖం తిప్పి, మే'స్ట్రీటు గార్ని చూపిస్తూ) స్త్రీల్‌మాండ్ మే'స్ట్రీటు, మా మామ

గారు. (మామగారి వేపు తిరిగి) వీరు మా మేజర్ గారు. ఈయన షాన్‌బెర్గ్, నాతో పాటు ఒక లెఫ్టెనెంట్.

మేజర్

మే' స్ట్రీటుగారూ, తిరిగి ఆజ్ఞ అయే వరకూ మీ ఊరు మాస్వాధీనంలో ఉంటుంది. మూడువందల సిపాయిలకు, మా వాళ్లకు, భోజనం ఏర్పాటు మీరు చేయాలి, గాని ఇప్పటినుంచే వాళ్లందరకూ భోజనం పెట్టక్కర లేదు లెండి. వీరిద్దరూ నేనూ ఈ ఇంట్లోనే ఉంటాము. మీకూ మా లెఫ్టెనెంట్‌కు ఉన్న బాంధవ్యం నాకు తెలుసును. మన అదృష్టం వల్ల ఈ బాంధవ్యం ఉండబట్టి మన మిప్పుడు చెయ్య వలసిన పనులలో ఏమీ చిక్కులుండవని నా నమ్మకం. అయినా పద్ధతి ప్రకారం జరిగించడమే మంచిది. అంతేకాక, మీ దేశస్థులు మాయెడల ఇంతవరకూ కనపరుస్తూఉన్న అనాదరణ బట్టిన్నీ, నాకు మావాళ్లు పంపించిన ఆజ్ఞను అనుసరించిన్నీ, మిమ్మల్ని జామీనుగా భావించవలసి వచ్చింది. మా సేనాధిపతులకు గాని, సిపాయిలకుగాని ప్రాణహాని కలిగే ఎటువంటి ప్రయత్నం జరిగినా, దానికి మీరు జబాబ్‌దారి—అనగా మీకు ప్రాణదండన విధించవలసివస్తుంది—గాని అటువంటి దురదృష్టం తటస్థించదని నా నమ్మకం. మీ ఊళ్లోవాళ్లంతా నడుచుకో

వలసినట్టు నడుచుకుంటే ఎటువంటి భయమూ ఉండ నక్కరలేదు. అందరూ ఏమనుకున్నా, మేము మాత్రం కిరాతులము కాము. అన్నిటికంటే ముఖ్యంగా మాకు కావలసినది న్యాయం—కాని అవుతూ ఉన్నది యుద్ధం గనుక, మేము ఒకొక్కప్పుడు కఠినంగా ఉండవలసి వస్తూ ఉంది, ముందుకు ఏమివస్తుందో అని అతి జాగ్రత్తగా ఉండవలసివస్తూ ఉంది. ఇంకొక ఘంటలో మీకు కబురు పంపుతాను. మీరు టౌన్‌హాల్‌కు రండి, అక్కడ మీరు చెల్లించవలసిన యుద్ధపు కప్పం గురించీ, మీరు మాకు చెయ్యవలసిన సప్లయిల గురించీ మాట్లాడదాము.

మే' స్త్రీటు

ఏమన్నారు? కప్పమా! కప్పం చెల్లించ వలసినంత పని మే మేదీ చెయ్యలేదే!

మేజర్

ఎంత చెల్లించడమో దాని విషయమై కావలస్తే మాట్లాడనిస్తాను గాని చెల్లించవలసిందా లేదా అన్న సంగతి గురించి మాట్లాడడానికి మట్టుకు మీకు అధికారం లేదు.

ఆటో

(మే'స్ట్రీటు గారితో) మొదటి అంతస్తులో ఉన్న పెద్ద పడక గది—ముందుకు డాబా ఉంది, డాబా మీ దికి వస్తే ఆ స్క్వేర్ కనబడుతుంది—ఆ గదీ, దానితో కలిసి ఉన్న గదీ, మా మేజర్ గారికి ఇవ్వండి. నేనూ ఆ రెండో లెఫ్టెనెంట్ గారూ ఖాళీగా ఉన్నం. రెండు గదులూ తీసుకుంటాము. షర్మిన్, మేజర్ గారినీ లెఫ్టె నెంట్ గారినీ వాళ్ళవాళ్ళ గదులలోకి తీసుకువెళ్ళు.

మేజర్

మే'స్ట్రీటుగారూ, నాదొక చిన్న మనవి. భోజనం ఈవాళ మామూలుకంటే ఒక అరఘంట ముందుగా కానివ్వాలి. సరీగా పన్నెండు ఘంటలకు భోజనానికి వచ్చి కూర్చుంటాము.

మే'స్ట్రీటు

అలాగునే చేదాము దానికేమి; (మేజర్నూ లెఫ్టె నెంట్ షౌన్బెర్గ్నూ నౌకరు తీసుకు వెళతాడు.) ఆహా! ...ఏమిటి ఆటో ఇది!

ఆటో

ఇజ్జెబెల్ ఎక్కడ?

మే'స్త్రీటు

మేడమీద తనగదిలో. నీ మాటలు కొంపతీసి ఆమెకు వినబడి ఉండవు కదా!

ఆటో

ఆమె ఒంట్లో ఏలాగున్నది? ఏమీ చికాకు లేదు కదా?

మే'స్త్రీటు

జబ్బు లేదనుకో; అయితే నేమి, ఇప్పుడు జరుగుతూ ఉన్న దంతా చూసి అమితంగా బాధపడుతూ ఉంది. మనస్సులో ఎప్పుడూ ఏదో విచారంతో కుంగిపోతూ వాడిపోయింది.... ఇంకా నిద్రపోతూ ఉంది అనుకుంటాను, లేపకపోవడమే మంచిది.

ఆటో

ఈ యుద్ధమూ అదీ చూస్తూఉంటే ఏమనుకుంటూ ఉంటుంది.

మే'స్త్రీటు

అందరిలాగే ఉంటుంది ఆమెకు కూడా—అతి ఆశ్చర్యముగాను, కోపంగాను, భయంగాను. కళ్ల ముందర కనబడుతూ ఉన్నప్పటికీ, మనమే నమ్మలేకుండా ఉన్నాము.

అటువంటప్పుడు ఆమె మాట మరి చెప్ప నక్కరలేదు కదా. ఆహా! ఆటో, నిన్ను ఎంత అసహ్యమైన పని లోకి దించేశారు.

ఆటో

మేము ఇదంతా అతి కులాసాగా చేస్తూ ఉన్నామని అనుకోకండి. మీరు చూస్తూనే ఉన్నారు, మేము ఈలాగు చెయ్యడానికి కారణం మీ దేశస్థుల . పాడు బుద్ధే—నమ్మడానికి శక్యం కాదనిపిస్తుంది—అటువంటి బుద్ధి మీ వాళ్లది, దానివల్ల మేము ఇంకొక దారి తొక్కదామన్నా వీలులేకుండా ఉంది.

మే' స్త్రీటు

మొదటి తప్పు బెల్‌జియమ్‌దే—అవును!

ఆటో

సందేహ మేమిటి! మీ రన్నంత మాత్రాన కాక పోదు. మా శత్రువుల ఆట తానే ఆడడం ఆరంభించింది బెలిజియమ్. మొదటిదెబ్బ మేము కొట్టకపోతే, ఏమయి ఉండును? బెల్‌జియమ్‌కు మే మంటే ఎంతో భక్తి అని నమ్ముకు కూర్చున్నదాని ఫలం ఈపాటికి అనుభ విస్తూ ఉందుము.

మే'స్ట్రీటు

చూడు ఆటో! నువ్వు తెలివైన వాడవు, నిజం అంటే మన్నించే వాడవు; మా అందరితో పాటు మా దేశంలో కొన్నాళ్లు ఉన్నావు. మేము ఏలాంటి వాళ్లమో బాగా తెలుసును కదా, అక్కడ ఆలాగు నిల్చొని ఏలాగు అనగలవు అటువంటి—ఇటువంటి అని చెప్పడానికి నోరు రాకుండా ఉంది, చెప్పగలిగి చెప్పినా నీకట్టే ఆదరంగా ఉండదు. ఆ దొంగమాటలు మీ సిపాయిలతో చెప్పారు బాగుంది, ఏమీ జ్ఞానమన్నమాట లేకుండా గర్వంలో మునిగి ఉన్న గొప్పింటి పిల్లలతో చెప్పారు బాగుంది. గాని అటువంటి మాటలు నీతోనూ నాతోనున్నా!—లిజే ఆన్ దెన్, దినాన్, ఏర్ షాత్, యీ స్థలాలలో జరిగిన ఘోర హత్యల గురించి ఏమనుకోవడమో నీకు తెలుసును. తెర ఎత్తేస్తే వెనుకనుండేది స్పష్టంగా కనబడ్డట్టు నిజమంతా నీకు కనబడుతూ ఉంది—నాకెంత స్పష్టంగా కనబడుతూ ఉందో నీకూ అంత స్పష్టంగానే కనబడుతూ ఉంది.

ఆటో

మీరు చెప్పినదంతా నిజం కాదు. చేతులు కట్టుకొని

నాకేమీ అక్కరలేదు అని బెల్జియమ్ కూర్చొని ఉన్నప్పుడు దానిమీద యుద్ధానికి రావడం మాతప్పే, గాని కొన్ని విషయాలనుబట్టి చూస్తే మాకు ఇంకొక మార్గం కనబడలేదు. ఆ తప్పుకు గాను మేము ఎప్పుడో శాస్తి పొందవలసినదే. కాని మీరన్న హత్యలమాట మాత్రం నేను ఒప్పుకోను. మీరు జామీనుగా ఉంచిన వాళ్లను కొంత మందిని మేము చంపడం నిజం. మనుష్యులను ఖైదీలగా పట్టుకోవడము, ఆస్తులు తీసుకోవడము, కూడా వాస్తవమే. కాని ఇది మీ దేశస్థులు చేసిన ద్రోహ కృత్యాలవల్ల మేము చేయవలసి వచ్చింది. బహుశా అక్కడక్కడ మావాళ్లు అవసరం లేని ఉద్రేకం చూపిస్తే చూపించి ఉండవచ్చును. అటు వంటివి ఆపడం ఎవరి తరమూ కాదు కదా ! నే నందులో వాడను గనుక నాకు బాగా తెలుసును జర్మనీ అంటే ఏమిటో. నియమాలకు లోబడి ఉండడంలో మా వాళ్లను మించిన వాళ్లు ప్రపంచంలో ఎవరూ లేరు; ఆజ్ఞ మీరి వెళ్లడంగాని, ఆజ్ఞ లేకుండా ఏదైనా చెయ్యడంగాని, ఎప్పుడో తప్ప జరగదు—ఎప్పుడో ఏమిటి—ఎప్పుడూ జరగదుఅని చెప్పవచ్చును.

మే' స్త్రీటు

నేను వాళ్లను నిందించేది అందుకే—మీకు వచ్చే ఆజ్ఞలు చాలా ఘోరమైనవి. అది మీ వాళ్లు చేసే పనిని బట్టి స్పష్టం.

ఆటో

మన అదృష్టం బాగుంది—ఇంకెవరూ లేరు దగ్గిర. ఇక ముందు మాత్రం అటువంటి మాటలు ఎప్పుడూ అనకండి—దానివల్ల కలిగే ముప్పు తప్పించడం ఎంత ప్రయత్నించినా నాతరం కాక పోవచ్చును.

మే' స్త్రీటు

సరే. ఆవిషయమై ఇకముందెప్పుడూ మనము వాదించ వద్దు. మీకూ మాకూ ఎప్పుడూ ఒక్క అభిప్రాయం ఆవిషయములో ఉండదు—ఆవిషయంలోనే అన్న మాట ఏమిటి, ఇంకా అనేక విషయాలలో కూడాను.

ఆటో

నాకు తెలిసేదేదో నాకూ తెలుసును. మీరు చెప్పినది నిజమో నేను చెప్పినది నిజమో ముందు జరగబోయే పనులవల్ల స్పష్టం అవుతుంది. ఇంతకూ ఈ మహాప్రళయం నేనుగాని మీరుగాని పుట్టించినది కాదు కదా!

ఇది రాకముందు ఎటువంటి భావంతో ఒకరినొకరము చూసుకుంటూ ఉండే వాళ్లమో అటువంటి భావంతోనే ఇప్పుడుకూడా ప్రవర్తించడానికి ప్రయత్నిస్తే చాలా బాగుంటుందని నా నమ్మకం.

మేజిస్ట్రేటు

మీ వాళ్లు మామీద తెచ్చిపెట్టిన ఘోర విపత్తుకు మేమే కారణం అని అందరిలాగు నువ్వుకూడా అన లేదు. అదే నాకెంతో సంతోషంగా ఉంది...

ఆటో

అటువంటి మాటలన్నీ నాతో చెప్పి ఏమి ప్రయోజనం? దేనిలోనూ కూడా నాకేమీ అధికారం లేదు కదా! అందరిలాగే నేనున్నూ పై అధికారానికి లోబడి ఉన్నాను. లోబడిఉండకుండా ఉండడం ఎవరితరం? ఇదంతా ఒక బ్రహ్మాండమైన మర; అందులో నే నొక చిన్న చక్రాన్ని. ఈలాగు తప్ప ఇంకొక మోస్తరు చెయ్యడం నా శక్యం కాదు. గాని నాకుండే స్నేహమూ అభిమానమూ ఏమీ పోలేదు, యుద్ధం ప్రారంభించక ముందు ఉన్నట్టే ఉన్నాయి. మీ అందరియందు నాకున్న

కృతజ్ఞతను కనపరచ వచ్చును కదా అని మా అధికారు లను ప్రార్థించుకున్నాను నన్ను ఇక్కడికి పంప మని.

మే' స్ట్రీటు

అదే కాదు కారణం, మాదేశం సంగతి నీకు బాగా తెలుసునని కూడాను.

ఆటో

ఆ ధోరణి ఇక మానేస్తే బాగా ఉంటుంది. ఆలాగు అనడం ధర్మంకాదు. మీ మాటలు వినడానికి నాకు అతి కష్టంగా ఉంది. మీతో నేను చెప్పినట్టుగా ఇది ఒక్కటే నా ఉద్దేశం: ఈ ఊరు మావాళ్లు ఆక్రమించుకోడానికి వస్తూ ఉంటే, అది నేను అడ్డుపడి ఆపలేక పోయినందుకు నాచేత నైనంత ప్రయత్నంచేసి దానివల్ల కలిగే ఇబ్బం దులూ కష్టాలూ మీకూ, మీరు అధికారిగా ఉన్న ఈ ఊరికీ కలుగకుండాచేస్తూ నాకృతజ్ఞత చూపిద్దాము అని.

మే' స్ట్రీటు

సరే అయితే దాని సంగతి మరి ప్రసంగించను... నువ్వు మీ సిపాయిలందరితోనూ కలిసి ఇంకా ఎన్నా ళ్లుంటావు ఇక్కడ ?

ఆటో

అదెవరు చెప్పగలరు? రెండు ఘంటలలో వెళిపో వచ్చును, రెండు మాసాలైనా ఇంకా కదలక పోవచ్చును. అదంతా ముందుకు జరగబోయే దాన్నిబట్టి ఉంటుంది, పైనుంచి మాకు వచ్చే ఆజ్ఞలనుబట్టి ఉంటుంది.

మేస్ట్రీటు

తరువాత—ఆ మేజర్—ఎటువంటి వాడు ఆయన? చిక్కులేకుండా ఏపనీ జరగనిచ్చే మనిషిలాగు కనబడడే!

ఆటో

అతికఠినమైన వాడు, అధికారం చలాయించే స్వభావము అతనిది. పద్ధతి అంటే అతి పట్టు; తను అనుకున్నది అక్షరాల జరిగితీరాలి. గాని న్యాయం విషయములో మాత్రం ఏమీ అతనిని అనలేము; దాని వల్ల ఏమివచ్చినా సరే న్యాయమే కావాలని అనే మనిషి. అన్నీ కలిపి చూస్తేమట్టుకు ఒక మోస్తరు మంచివాడే. మళ్లా చెప్తున్నాను వినండి, మీవాళ్లు బుద్ధిగాఉంటే మీ కెటువంటి హానీ కలగదు; మీరేమీ భయపడ నక్కరలేదు. అంతేకాకుండా అసాధ్యంగా కన

బడే తగాయిదా ఏదైనా వస్తే ఆయనకు నామీద ఉండే ఆదరణా, మా ఇద్దరికీ ఉండే స్నేహమూ, వీటిని ఉపయోగించి వ్యవహారం సరిచేయ గలనని నా నమ్మకం... ఇక ఇదంతా మరిచిపోయి మునపటి మోస్తరుగానే బంధువులుగాను స్నేహితులు గాను ఉందాము. (అని చెయ్యి చాపుతాడు.)

మేస్త్రీటు

(చెయ్యి వెనకకు తీసుకుంటూ) ఇప్పుడు కాదు, ఇప్పుడు కాదు...క్షమించు...మరిచిపోవడాని కైనా కొంతవేళ కావాలి కదా...

ఆటో

ఏమిటిది! నాకేమీ బోధపడకుండా ఉంది! ఈ యుద్ధం నేనుగాని మీరుగాని తెచ్చిపెట్టినది కాదు, తెచ్చిపెట్ట గలిగినది కాదు. మనము అది చెయ్యాలేము ఆపాలేము ......మమ్మల్ని అని ప్రయోజనం లేదు......ఆంటిగోన్ అన్నట్టుగా *ప్రేమతో సంబంధించిన విషయాలలో మాత్రం నేను సంబంధం కలుగ జేసుకుంటాను;

*ఆంటిగోన్—సోఫోక్లీస్ అనే గ్రీస్ దేశపు కవి రాసిన నాటకంలో ఒకపాత్ర.

ద్వేషంతో సంబంధించిన విషయాలలో కలుగజేసుకోను. సరే ఇప్పుడు వేళ ఎంత అయిఉంటుంది? పదకొండా? ఒంట్లో అట్టే సుస్తీగా లేకపోతే ఇజెబెల్‌కు కబురు పంపిద్దాము? ఎన్నాళ్లాయింది చూసి! అందులోకీ ఈ అల్లకల్లోలం అంతా జరిగింది, చూదామని ఎంత ఆతురతగా ఉంటానో మీకు తెలుస్తుంది.

మే' స్త్రీటు

ఆమె నౌకరీదానిచేత కబురు పంపిస్తాను. (కాల్ బెల్—నౌకరు ప్రవేశం—మే' స్త్రీటుగారి మాట విని వెళుతుంది.) మా అబ్బాయిమాట నీకు ఏమైనా తెలుసునా?

ఆటో

ఒదిలోనా?—ఇక్కడ లేడూ?

మే' స్త్రీటు

ముందుకు ఏమి చేయబోతున్నారో మీవాళ్లు నీతో చెప్పినట్టు మాకు ఎవరూ చెప్పలేదు. అందుచేత వాడు కొలోన్‌లోనే ఉండి పోయినాడు. ఇప్పుడు మాకు వాడి గురించి అతి భయంగా ఉంది.

ఆటో

దేనితోనూ సంబంధం కలుగజేసుకోకుండా నెమ్మదిగా కూర్చుంటే అతనికి ఎటువంటి హానీ కలగదు. ఇంటర్న్మెంట్ క్యాంపులో ఉంచుతారు. మావాళ్ల పేర రాసి అతనికి ఇబ్బందేమీ కలగకుండా ఏర్పాటు చేయిస్తాను... ...వహ్వా! మీ టేబిల్ మీద ఉన్న పువ్వు ఎంత అందంగా ఉంది. నేను వెళిపోక ముందు అంత బాగా పెరిగేవి కావు—ఏదో జబ్బు పట్టినట్టుండేవి. ఇప్పుడు ఎంత బాగా పెరుగుతున్నాయి!

మే'స్త్రీటు

దారిలో పడ్డాయి, ఇక మరి భయం లేదు. మైక్రోస్కోప్ పెట్టి చూసి అవి వాడిచస్తూ ఉండడానికి కారణం కనిపెట్టాను. కంటికి అగపడని పురుగుజాతి ఒకటి దానిని పట్టిఉండెను. ఇంతకు ముందు అది ఎవరూ కనిపెట్టలేదు—మామూలుగా చేసే సాధనాల వల్ల— అనగా ఆవిరి పెట్టడంవల్లా, ద్రావకాలపొగ పెట్టడం వల్లా ఒక్కపిసరూ ప్రయోజనం లేకపోయింది. కొత్త పాళ్లువేసి ఒక మందు కనిపెట్టాను. ఆపాళ్లు నీకు చెప్తాను. అతి అద్భుతం దానిగుణం. ఇంత వేంటాలు

పడి పెంచుతున్నానా, నా *హాట్ హౌసుల గురించి.
నాకు చాలా భయంగా ఉంది. నా ఆస్తిలో సగంకి పైగా
పెట్టాను వీటికింద; నా జీవిత కాలంలో పనికి వచ్చే భాగ
మంతా వాటికిందే పెట్టాను. ఈ యుద్ధం వచ్చింది, ఆ
ఇళ్లు యేమి అవుతాయో!—కొంపతీసి అవన్నీ కూలి
గాజు పెంకులూ ఇనపపట్టీలే మిగులు అనిపించుకోవు
కదా! నీకు తెలుసును కదూ, లక్ష జాతులకు తక్కువ
ఉండవు అందులో ఉండే పువ్వుల రకాలు? అవి గాని
పోతే మరి ఆ నష్టం సరిచెయ్యడం ఎవరి తరమూ కాదు.
నేను సంపాదించిన రకాలన్నీ తిరిగి జాగ్రత్త చెయ్యడ
మంటే మళ్లీ ఇంకొక జీవితకాలము అన్న మాట.

ఆటో

మీరు అటువంటి భయమేదీ పెట్టుకోకండి. ఈప్రాం
తాన యుద్ధమూ జరగదు, బాంబులూ పడవు. మీ
ఊరు మేము ఆక్రమించుకొని ఉన్నంతకాలం, నా
మామగారి ఇల్లు—నాభార్యఇల్లు—నేను కాపాడ

*హాట్ హౌస్— శీతలప్రదేశాలలో అద్దాలతో ఇళ్లుకట్టు. చలికి
చావకుండా అందులో మొక్కలను పెంచుతారు.

గలను. నా చేతులతో నేనే కాపాడలేకపోయినా మా వాళ్ల చేత కాపాడించలేకపోలేను.

మే' స్త్రీటు

ఇదుగో, ఇజెబెల్ వస్తూఉంది.

(ఇజబెల్ ప్రవేశం.)

[ఒక్క క్షణం గుమ్మందగ్గిర నిల్చొని ఆటో వేపు పరుగెత్తు తుంది. ఆటో చేతులు చాచి దగ్గరకు తీసుకుంటాడు.]

ఇజెబెల్

మీారే! ఏమిటీ! మీారిక్కడికి రావడమూ నాకు తెలియక పోవడమున్నా!

ఆటో

(మరింత దగ్గిరికి తీసుకుంటూ) ఇజెబెల్!

ఇజెబెల్

దెబ్బ ఏదీ తగలలేదు కదా? కులాసాగా ఉన్నారా?

ఆటో

కులాసాగానే ఉన్నాను. నీ ఒంట్లో ఎలాగుంది? సుస్తీగా ఉన్నావని విన్నాను.

ఇజెబెల్

అబ్బే అదొక జబ్బుకాదు. ఈ జరుగుతూఉన్న ఘోరాలన్నిటివల్లా పుట్టిన భయమూ, మీకు శత్రువుల వల్ల ప్రాణానికి ప్రహాని కలుగుతుందో అని దిగులూ తప్ప...

మేజిస్ట్రేటు

శత్రువులా! శత్రువు లెవరు, తనూ తన స్నేహితులే కదూ? వాళ్ళమధ్య అతనికి ఎటువంటి ఆపద సంభవించదు ...సరే నేను వెళతాను. కావలసినప్పుడు కబురు పంపించండి వస్తాను.

ఇజెబెల్

అంతా తారుమారయిపోయింది. ఎవరితో ఎటువంటి సంబంధమో తెలియకుండా ఉంది. మీకు కీడుకోరే వారు కదా నాకు శత్రువులు. అనగా నేను ప్రేమిస్తూ ఉన్నమావాళ్లందరూ నా శత్రువుల అన్నమాట. నేను ఆడదాన్ని—ఇటువంటిది భరించడం నాశక్యం కాదు... గాని ఇప్పుడు మరేమీ లేదు కదూ? ఆ మహాప్రళయం దాటి పోయినాము కదూ?

ఆటో

బాగానే ఉంది! అయిన దేముంది, అంతా ముందుకే ఉంది...గాని నేను చెప్పేది వినకుండా నామీద నింద మోపడం ఎవరు చేసినా చెయ్యవచ్చును గాని నువ్వు మాత్రం చెయ్యవని అనుకున్నాను.

ఇజెబెల్

నేను దూషించేది మిమ్మల్ని కాదు, తలిమ్మా మీవాళ్ల నందరిని. మీరేమి చేశారు, నాది ఎంత తప్పో మీదీ అంతే తప్పు. ఇంతకీ నాకు దీనంతటితో పనేముంది, నా ఎప్పటి—మీరు నాకు ఉంటూ ఉంటే? మీరిక్కడ కొన్నాళ్లుంటారు. కదూ?—ఘోరంగా ఈ పాడు యుద్ధం వచ్చిపడ్డందుకు ఆ సంతోషమన్నా కలిగితే, కొంచెంసేపు అంతా మరిచి పోవచ్చు.

ఆటో

నేనేమీ చెప్పలేను. రేపే వెళిపోవలసి వస్తే రావచ్చును.

ఇజెబెల్

మీరు యుద్ధంచేస్తూ ఉన్నవాళ్లతో ముందు భాగంలో ఉన్నారా, వెనక నున్న వాళ్లతో ఉన్నారా?

ఆటో

ఇప్పుడు ముందంటూ ఏదీ లేదు. ఒక చోట కాదు యుద్ధం, ప్రతిచోటాను. మేము ఒక గొప్ప ప్రవాహం లాగు తోసుకు పోతున్నాము కదూ! మీనాన్న గారితో చెప్పడానికి సాహసం లేకపోయింది—బెల్ జియమ్అంతా ఆక్రమించేశాము. ఆంత్ వెర్ప్ రేపటికి పడిపోతుంది. ఇంకొక వారం అయేసరికి పారిస్ మా చేతిలో ఉంటుంది.

ఇజేబెల్

తరవాత!

ఆటో

మరి తరవాతేమిటి—అదే యుద్ధంలో జయమంటే. ఇక్కడ సంసారం చేసుకుంటూ స్థిరంగా ఉండిపోతాము, నీతో కలిసి వస్తాను, జర్మనీ వెళిపోదాము అని నీవు అంటేతప్ప.

ఇజేబెల్

మీ రెక్కడికి వెళ్తే నే నక్కడికి వస్తాను.

(ఫ్లారిస్ ప్రవేశం.)

ఫ్లారిస్

నాన్న ఇక్కడ ఉన్నాడా?

ఆటో

ఇదుగో ఫ్లారిస్! రా, అమ్మా ఇలా రా! (అంటూ చెయ్యి చాపుతాడు)

ఫ్లారిస్

(అసహ్యంతో వెనక్కు వెళిపోతూ) నీదగ్గిరకా!

ఇజెబెల్

ఇదిగో, ఫ్లారిస్!

ఫ్లారిస్

నాన్నేడీ, అక్కా?

ఇజెబెల్

నాన్న పక్కగదిలో ఉన్నాడు. ఫ్లారిస్ చూడు, బావ దగ్గిర ఆలాగు చెయ్యవచ్చునా—మన బావ కారూ! మనకేమి చేశారు బావ—ఏమీా బాధ కలగకుండా కాపాడడానికే కదా మన దగ్గిరికి వచ్చారు.

ఫ్లారిస్

అతను కాపాడక్కర లేదు నన్ను—చాలు. (అని బయటికి పారిపోయి, తలుపు దభీ మని వేసేస్తాడు.)

ఆటో

చూశావా ద్వేషం? ఘోరం, ఘోరం! ఎక్కడ చూసినా ఇదే రకం. చెపితే వినిపించుకోరు, అంతే. వినిపించుకోరు, బోధపరుచుకోరు. మీ నాన్నగారిలో కూడా నాకు అదే కనబడ్డది—ఆయనకంటె సాధువ్వూ, ఆయనకంటె శాంతుడూ, ఆయనకంటె ధర్మబుద్ధి గలవాడూ మరి లేడుకదా! మీవాళ్లు మమ్మల్ని ఈలాగు దూషిస్తూ ఉంటే మేము ఏమి చేయగలము?...సరే అది పోనీ, ఈ అబ్బాయి మీద మాత్రం ఒక కన్ను ఉంచాలి ఎప్పుడూ; ఈ దూషణ మానేస్తే చాలు. మా మేజరు గాని, ఆ రెండో లెఫ్టినెంట్ గాని అటువంటి మాటలు విన్నారా అంటే మాత్రం గొప్ప ప్రమాదం సుమా! (దూరాన గుండుశబ్దం.) అది గుండు శబ్దం!

ఇజబెల్

అవును. తోట చివరను, అడవి సమీపాన్ని.

(మే'స్ట్రీటు, ఫ్లారిస్ అతి తొందరగా ప్రవేశం.)

మే'స్ట్రీటు

మీకు వినబడ్డదీ? తుపాకీ, శబ్దం!

ఫ్లారిస్

(పళ్లు కరుస్తూ) ఒకడు తగ్గాడు, మంచి పని అయింది.

ఆటో

ఏమిటంటున్నావు?

ఫ్లారిస్

ఏమీ లేదు, నాకు ఇష్టం వచ్చిన మాట నే నను కుంటాను, నీ కెందుకూ?

మే'స్ట్రీటు

(తత్తర పాటుతో) ఎవరు పేల్చారు ఆగుండు? మీ మనుష్యులలో ఒకడు అయివుండాలి. ఈ ఇంట్లో తుపాకిఅన్న మాట లేదు. ఇంట్లో కాదు కదా ఈ ఊళ్లో లేదు.

ఆటో

నాతో వచ్చిన రెండో లెఫ్టెనెంట్ అయివుంటాడు. ఆడివిలో తిరుగుతూ పేల్చి ఉండాలి. వేటంటే అతి

పరదా అతనికి. ఇక్కడ చెవులపిల్లులు అనేకంగా ఉంటుం
తాయి అని కూడా చెప్పాను నేను.

మే’స్త్రీటు

అవును, ఆ శబ్దం అటుపక్కనుంచే వచ్చింది కూడా
ను. గాని అయితే ఇంట్లో ఒక తుపాకీ అయినా లేదే!

ఆటో

కమాను సామానుతోపాటు అతను ఎప్పుడూ ఒక
తుపాకీ ఉంచుకుంటాడు...సరే, ఏమైనప్పటికీ ఊళ్లో ఒక
తుపాకీ లేనప్పుడు మీరేమీ గాభరా పడనక్కర లేదు.
మీ నౌకర్లు ఏపాటి నమ్మకమైనవాళ్లు. అందరికీ మీ
మీద భక్తి శ్రద్ధలు ఉన్నాయా? ఎవడైనా ఉండ
వచ్చును కదూ అసంతుష్టి ఒకడు; వీలు చూసుకొని...

మే’స్త్రీటు

అసంతుష్టి అంటే నాకు బోధపడడం లేదు. ప్రతివా
డికీ ఒళ్లు మండుతూఉంది; కోపంతో మండిపోతున్నారు.
ఇదంతా చూస్తే కోపం లేకుండా ఎవరు ఉండగలరు
నామనుష్యులు కోపం కట్టుకొని ఓర్చి ఉండగలవాళ్లు
గాని వృథాగా ఒకరిని చంపేటంత మూర్ఖులు కార్ను

చంపడంవల్ల దినాన్ ఆన్ దెన్, లొవైన్, ఏర్ షాత్ ఈ ఊళ్ళలో చేసినట్టుగా అంతా నాశనం చేసేస్తారనీ, వందల కొలది నిరపరాధులను చంపుతారనీ అందరికీ తెలుసును. గనుక అటువంటి బుద్ధిమాలిన పని చేసేవారు ఎవరూ ఉండరు. నేను వాళ్లను బాగా ఎరుగుదును, ఎంతైనా ఓర్చి ఉండగలవాళ్లు—రోజులు వచ్చేవరకూ ఏమీ చెయ్యరు.

ఆటో

ఏ రోజులు?

మేస్త్రీటు

తరవాత వచ్చే రోజులు.

ఆటో

నాకేమీ తెలియడం లేదు సుమండీ; మీరాడే మాటలు బాగు లేవు. మా శత్రువుల మోస్తరే మీరూ మాట్లాడుతున్నారు—శత్రువులే కాదు, పరమ శత్రువులు!

మేస్త్రీటు

శత్రువు కాక స్నేహితుణ్ణి అవమంటావా ఏమిటి నన్ను అవమానపరచ దలచుకుంటే ఆలాగు అంటావు.

నేను కూడా...సరే అదంతా చెప్పి ప్రయోజనం లేదు; అటువంటి మాటలు అనకుండా ఊరుకోవడమే మంచిది. ఇది చూస్తే నాకు కీళ్లన్నీ ఒదులయిపోయినట్టుగా ఉంది—నేను కదూ జబాబ్ దారీ వీటన్నిటికీ! ఏదివచ్చినా నానెత్తిమీదే పడుతుంది.

ఆటో

ఇంటివెలపల అడుగుల చప్పుడు వినబడుతూ ఉంది. (కిటికీ దగ్గిరికి వెళ్లి తలుపుతీసి చూస్తూ) నువ్వా సార్జంట్! ఏమిటి సంగతి?

సార్జంట్

(కింద తోటలో, ఎవరికీ కనబడకుండా) నాకేమీ తెలియదు. లెఫ్టెనెంట్ గారు మాత్రం ఆవేపు వెళ్లడం చూశాను.

ఆటో

ఎప్పుడు?

సార్జంట్

ఒక పావు ఘంట కిందట.

ఆటో

(మేజిస్ట్రేటుగారితో) నేను చెప్పలేదూ—అడవిలో షికారుకు వెళ్లాడు.

సార్జంట్

చేతిలో తుపాకీ ఏదీ లేదే!

ఆటో

నువ్వు చూశావూ? ఆశ్చర్యంగా ఉందే?...త్వరగా పరిగెత్తుకొని వెళ్లి చూడు ఏమిటయిందోను, మొఖం ఆలాగు పెట్టుకొని చూస్తూ అక్కడ నిల్చుండే కంటే!

సార్జంట్

చిత్తం, అలానే—నేనటే వెళుతూ ఉంటే మీరు నన్ను ఆపారు. కొంత మందిని అక్కడికి పంపాను అప్పుడే.

ఆటో

అదుగో కేకలు వినబడుతున్నాయి. వింటే నాకేదో భయం వేస్తూ ఉంది. ఇదుగో మనవా డెవడో వస్తున్నాడు, అతనికి తెలుస్తుంది ఏమిటయిందో.

సార్జెంట్

త్వరగా, త్వరగా! ఏమిటా గొడవ?

సిపాయి

(ఇతను కూడా తోటలోనే, ఎవరికీ కనబడడు.) లెఫ్టెనెంట్ గారు! లెఫ్టెనెంట్ గారేరీ, లెఫ్టెనెంటుగారు?

ఆటో

ఇదిగో ఇక్కడ—ఏమిటయింది? చెప్పవేం, ముందు?

సిపాయి

లెఫ్టెనెంట్ షాన్‌బెర్గ్! ...లెఫ్టెనెంట్ గారిని చంపేశారు.

ఆటో

ఏమిటి? ఎవరినీ? దగ్గిరికి రా. ఏమిటంటున్నావు?

సిపాయి

చచ్చిపోయినారు.

ఆటో

ఎప్పుడు? ఎలాగు? డాక్టర్ కోసం కబురు పంపండి. ఇదుగో నేనుకూడా వస్తున్నాను. దెబ్బ తగిలిఉంటుంది. అంతే అనుకుంటాను.

సిపాయి

లేదు, తలలో నుంచి గుండు వెళిపోయింది. మన వాళ్లు వెళ్లేసరికి ఆ పొదలో పడి ఉండెనట.

ఆటో

చంపిన వాడిని పట్టుకున్నారా?

సిపాయి

అడవిలో వెతుకుతున్నారు, గాని ఇంతవరకూ ఎవరూ దొరకలేదు.

ఆటో

(సార్జంట్‌తో) అన్ని గేట్లదగ్గిరా ఫారా పెట్టించు— వేగం, వేగం! ఎవడైనా సరే పారిపోడానికి మాత్రం ప్రయత్నంచేశాడా అంటే ఎక్కడుంటే అక్కడ నుంచి తుపాకీతో కొట్టేయండి...ఎవ్వడూ పారి పో లేదు. మేజర్ గారు ఎక్కడ?

సార్జంట్

నాకు తెలియదు.

మే స్పీటు
(60)

ఆతని గదిలో ఉంటాడు బహుశా, ఇంటి అవతలి భాగంలో. ఇదంతా వినబడి ఉండదు.

ఆటో

ఎవరి నైనా పంపండి.

మే'స్ట్రీటు

ఇదేమీ శుభసూచకంగా లేదే!

ఆటో

భయపడకండి. దొంగ ఎక్కడికీ పారిపోలేదు. పట్టు కొని వాడికి తగిన పని చేస్తాము—ఈలాటి బుద్ధి మరి ఎవడి కైనా పుట్టినా బాగా పదిమార్లు ఆలోచించనిదే చెయ్యకుండా. కదలకండి ఎవ్వరూ! గది విడిచి పెట్టారా అంటే, ఎవరైనా సరే, అనుభవిస్తారు; తర వాత నన్నన్ని లాభం లేదు.

(అందరూ వెళతారు.)

---

# రెండో అంకం

(స్థలం—అదే: మేజర్, మే'స్త్రీటు, ఆటో, సెక్రెటరీ, ఇజె బెల్.)

మేజర్

మే'స్త్రీటుగారూ, మా లెఫ్టెనెంట్‌ను మీ జాగా లో చంపేశారు. మీ తోటమాలీని ఒకణ్ణి ఆసమీపంలో పట్టుకున్నారు. వాడే చంపిఉంటాడని మనము ఊహించ వచ్చును. చంపినవాడు నిజంగా వాడుఅయినా కాక పోయినా, కాదు అని రుజువు వచ్చేవరకూ వాడే నేర స్థుడు అని భావిస్తాను; మాకు కావలసినది అదే. ముందుకు అందరూ బుద్ధిగా ఉండేటట్టుగా మేముఏదైనా చేయ్యాలి. ముందుకు ఏమీ రాకుండా మేము క్షేమం గా ఉండాలంటే ఈ విషయంలో ఊరుకో కూడదు; మా క్షేమం అన్నిటికంటే ముఖ్యంగా కావలసినది. యుద్ధ సమయంలో ఒక్కక్షణమైనా పోకుండాచేసేదే న్యాయం—గనుక సరిగారాత్రి ఏడు ఘంటలకు మీ మాలీని గుండువేసి చంపేస్తాము, అప్పటిలోగా

అపరాధిఅని మీరు అనుకొనేవాణ్ణి తీసుకువచ్చి మాకు అప్పచెపితేనే తప్పు. మీ నౌకర్లు ఎవరెవరు ఎటువంటి వాళ్లో నాకంటే బాగా మీకే తెలుస్తుంది. అందుచేత ఆ కూనీ చేసిన వాడెవడో నాకంటే మీరే బాగా తెలుసుకోగలరు. మీరు చేసిన పనికి ప్రాయశ్చిత్తంగా ఎంత క్రూరమైన పనులు చేయించినా చేయించగలను—చేయించడానికి కావలసిన అధికారం నాచేతిలో ఉన్నది; దానికి తగిన సాహసం నాకు ఉన్నది. నా పదవిలోనే ఇంకొకడు ఉంటే ఊరంతా కొల్లపెట్టించేసి ఉండును. నిప్పు ముట్టించి తగలబెట్టించేసి ఉండును; ఊళ్లో ఉండే వాళ్లలో సగంమందిని చంపించేసి ఉండును. అంత చేస్తేనే న్యాయం అంటారు. లెఫ్టెనెంట్ ఆటో హిల్మర్ కోరడంవల్ల ఒక్కడి ప్రాణంతో నేను తృప్తి పొంది ఊరుకుంటాను. ఎందుకు వీళ్ల కింత దయ చూపించాను అని నాకు అనిపించకుండా ఇక ముందు మీరు నడచుకోవాలి.

## మేస్త్రీటు

ఆ పట్టుకొన్న వాళ్లతో చెప్పాను; అదే మీతో నాళ్లా చెపుతున్నాను వినండి. మా ముసలి

హెడ్ తోటమాలీ ఆ అపరాధం చెయ్య లేదు; అతడు చేశాడని నేను ఊహించనైనా ఊహించలేను. నలభై ఏళ్లకు పైగా అయింది అతను మా యింటికి పనికి వచ్చి. నా విషయమై ఎంత ధైర్యంగా చెప్పగలనో అతని విషయమై కూడా అంత ధైర్యంగా చెప్పగలను. అతను అతి సాధువు; ఎంతైనా ఓర్చి ఉండగలవాడు; అమాయకుడు. ఆ అడవిలో ఒక మూల పూల మొక్కలు పెంచే ఒక చిన్న తోట ఉన్నది. ఈ ఉదయం అతన్ని అక్కడకి నేనే పంపించాను, గులాబీ అంట్లన్నీ కోసి తొట్లలోకి ఎత్తమని. మీ లెఫ్టెనెంట్ చచ్చి పోయిన అడవిలో అతను కనబడడానికి అదీ కారణం. అతని దగ్గిర ఉండే ఆయుధాలన్నీ అంట్లుకట్టే కత్తి ఒకటీ, కత్తెర ఒకటీ. అంతే కాదు, పుట్టిన దగ్గిరనుంచి ఇప్పటి వరకూ తుపాకీ పట్టుకొని ఎరగని వాడు మా పనివాళ్లందరిలో ఈత నొక్కడే, అది నాకు బాగా తెలుసును.

మేజర్

మేజిస్ట్రీటుగారూ, మీరొక్క చిన్న సంగతి గ్రహించనట్టు ఉన్నారు. మీ తోటమాలి నిరపరాధి

అని చెప్పడం వల్ల అపరాధం మీా నెత్తిమీాద పెట్టు కుంటున్నారు. గాని మీాతో వాదనపెట్టుకో దల చుకో లేదు ; ఆ చర్చంతా నాపని కాదు. ఏలాగు చేసు కోండి, నేను చెప్పవలసినదేదో చెప్పాను. నాకు కావలసినదంతా అపరాధి అంటూ ఒకడు ; ఆ అపరాధి సరీగా ఏడు ఘంటలకు గుండుదెబ్బతో చావడం. అది మీా మనుష్యులలో ఒకడు కావాలి, మీా ఇష్టం వచ్చినవాడు. ఇంకెవరినీ మీారివ్వ లేనప్పుడు అది మీారే కావలసి ఉంటుంది. ప్రస్తుతం మీారు ఈ ఇంట్లోనే మా ఎరుష్టులో ఉన్నట్టుగా భావించు కోవాలి. ఇంటికి అన్ని వైపులా కాపలా ఉంచాను. తప్పించుకొని పారిపోవ డానికి ప్రయత్నించకండి. అది కేవలం వ్యర్థప్రయత్నం అవుతుంది. యుద్ధపు కప్పం కాక మీారు చెల్లించవలసిన జరిమానా ఎంతో సాయంత్రం నాలుగు ఘంటలకు మీాతో చెపుతాను. అది మీారు రేపు మధ్యాహ్నం పన్నెండు ఘంటలలోగా చెల్లించాలి.

(మేజర్ వె.)

మే'స్త్రీటు

ఇదంతా పిచ్చిగా ఉందే ! నామనుష్యులలో ఎవరికీ అటువంటి హాత్య చేదామన్నా వీలులేదని స్పష్టంగా

తెలుస్తూ ఉంటే ఎవరి పేరైనా చెప్పమని అడగడం ఏమి అనుకోనేది! సాయంత్రం లోగా ఆ మనిషిని వాళ్లకు అప్ప చెప్పకపోతే నేనే ఆ సిపాయిల చేతిలో పడి వాళ్ల తుపాకీలకు బలి కావాలట. మహోదయగల వాడనని చెప్పుకుంటూ ఉన్న మీా మేజర్‌గారి సరసం విరసమైనదని నువ్వు ఇకనైనా ఒప్పుకుంటావా? ఏమీా జ్ఞానము లేని పశువా ఏమిటి, ఎదురుగుండా ఏది కనబడితే దాన్ని నాశనం చేస్తూ! శుద్ధ మూర్ఖుడు నయం అతనికంటె—అటువంటి మూర్ఖుల విషయంలో నైనా దగ్గిర ఉన్న వాళ్లకు ఎప్పుడు ఏమి అవుతుందో కొంతవరకు ఊహావల్ల తెలుసుకోవచ్చును.

ఆటో

అతను ఏమి చేయవలసినదని మీా ఉద్దేశం? ఇప్పటి స్థితిని బట్టి చూాస్తే ఇంకొకలాగు చేయలేడు.

ఇజెబెల్

అదేమి టా మాట!

ఆటో

అయితే చివరకు నిజమే! మాచుట్టూ శత్రువులే, చుట్టూ ద్రోహులే అని తెలుస్తూ ఉంది. ఎటు

చూసినా మామీద ద్వేషమే ! బోనులో ఉన్నట్టుగా ఉంది ప్రతిక్షణం మాఅవస్థ. ఊపిరి లేనిదారం మా ప్రాణానికి ఆధారం. ఏక్షణానికి ఎవడి బుర్రకి గుండు తగులుతుందో అని గుండెలు చేతులో పట్టుకుకూర్చు న్నాము. మమ్మల్ని మీరు ఈలాగు చూస్తూఉంటే మా ప్రాణాలు మేము కాపాడుకొంటూ ఉండడరి సహజం కాదూ ? మా మేజర్ గారు చేసినదే చాలా మంచి ఆలోచన అని నా ఉద్దేశం. అతి దయతోనూ అతి ధర్మబుద్ధి తోనూ ఆలోచించి నిశ్చయించారని నానమ్మకం. ఊళ్లో ఉన్నవాళ్లందరినీ చంపించేడానికి కూడా అతనికి అధి కారం ఉన్నది. మీరు చేసిన దానికి ఆలాగు చంపక పోవ డంవల్ల చెయ్యవలసిందంతా చెయ్యలేదన్న మాటే! దానికి బదులుగా ఒక్కణ్ని ఇస్తే చాలు అంటున్నారు మీకు ఇంకా తృప్తిలేదే, ఇటువంటి అపరాధం జరిగినా. ఏమీ శిక్ష లేకుండా వదలేయాలిఅనా మీ ఉద్దేశం అనగా మా ప్రాణాలేవీ మావి కావనుకొని కూర్చో! వాలన్న మాట ! ఇంతకూ అపరాధి దొరకడం సుల భమే. వచ్చిన రుజువును మీరు స్థిరపరిస్తే చాలు. ఇంకే పాతమూ లేక పోయినా ఆ మనిషి ఆ అడవిలో ఉండ

డం ఒక్కటే చాలు. మీరెంత ప్రయత్నించినా ఆ నమ్మకాన్ని మీరు పోగొట్టలేరు. మీరు చెయ్యవలసిన దంతా ఒకటే, జరిగేది జరుగుతూ ఉంటే మీరు ఏవిధమైన అడ్డూ పెట్టకుండా ఊరుకోవడం మేజర్ అనుకొన్నది నిజం కాదనుకోండి, అతను చేసేది పొర పాటనుకోండి, దానిఫలం తానే అనుభవిస్తాడు, మీ కేమి, నాకేమి !

మే'స్ట్రీటు

నా చెవులు నేనే నమ్మలేకుండా ఉన్నాను. యుద్ధం వచ్చి నిన్ను పూర్తిగా మార్చేసింది, నీమనస్సు మున పటి మనస్సు కానే కాదు. నాలాగే నీవునూ బాగా ఎరుగుదువు క్లాస్ ఎటువంటి వాడో. నా మనుష్యులంద రిలో ఇటువంటి పని ఊహించనైనా ఊహించలేనివాడు బహుశా అతనొక్కడే. ఇంకెవరి గురించైనా అయితే నాకు కొంచెం సందేహం ఉండునేమో, గాని క్లాసా ! ఇజెబెల్‌కు పుట్టబోయేబిడ్డ ఆ తుపాకీతో కొట్టాడు అంటే ఏలాగు ఉంటుందో మా క్లాస్ అన్నా ఆలాగే ఉంది. వాడు చేశాడని నమ్మకమా!...ఎంత సాహసం నీది ఆలా'అనడానికి? ఆ పూలమొక్కల దగ్గిరికి ఎందుకు

వెళ్లాడో నీకు తెలియదూ? అతనిని అక్కడికి పంపించి వది నేను—ప్రొద్దున్నే నా దగ్గిరికి వచ్చి ఈవాళ ఏమి చేయమంటారు అని అడిగితే, అక్కడికి వెళ్లమని నేను చెప్పాను. చేయగలిగినదంతా చేసి అతను నిర్దోషి అని చూపించక పోతే ఆతనిని చంపమని నా నోటితో నేనే...

ఆటో

కావచ్చును. గాని అతను నిర్దోషి అని చూపించిన తరువాత మాత్రం అతని వంతు తుపాకీలకు ఎదురుగా మీరే నిల్చోవాలి.

మేజిస్ట్రేటు

ఆహా! ఇంతకంటే అది చాలా మేలు!...గాని అటువంటి పని చేయరు మీవాళ్లు.

ఆటో

అవును, చేయరు, ఇంకొక మోస్తరుగా చేయడానికి వీలు లేకుండా మీరు చేస్తేనే తప్పు. ఇప్పటి నుంచి సాయత్రం దాకా వేళ ఉంది గనుక ఆలోపున నిజమైన నేరస్థుడు దొరుకుతాడు.

మే స్త్రీటు

నిజమైన నేరస్థుడా ? అతని కోసం ఎక్కడ వెత కాలో తెలుసునా ? మీవాళ్లలో. దాని రహస్యం ఏమి టంటే, మీ సిపాయిలలో ఎవడో ఒకడు అతనివల్ల కలిగిన బాధ జ్ఞాపకం ఉంచుకొని, ఇదే మంచి సమయం అనుకొని, అతనిని పరిష్కారం చేసేశాడు. జ్ఞాపకం ఉందా, మేజర్ రాకముందు నువ్వే చెప్పావు, "మా లెఫ్టినెంట్ పరమ పోఖరీ ; అతనంటే అసహ్యపడని వాడూ, అతనిని పరమ నీచుడు అని అనని వాడూ లేడు" అని.

ఆటో

అది నిజం కాకపోలేదు. గాని అదెక్కడ, అతనిని ఖూనీచేసి చంపడం ఎక్కడ ! ఐనప్పటికీ మావాళ్లను చేయవలసిన విచారణంతా నేను చేస్తాను. మీరు చేయవలసినదేదో మీరు చేయండి. క్లాస్‌ను అడ గండి; దానివల్ల దొంగజాడ దొరికితే దొరకవచ్చు.

మే స్త్రీటు

అడగడానికి నాకు అభ్యంతరం లేదు గాని ఏమీ ప్రయోజనము లేదని నానమ్మకం. పాపం, అతని కేమీ

తెలియదు. తెలిస్తే ఇదివరకే చెప్పి ఉండును. గాని మనలో మాట నాకు కొంచెం చెప్పుమీ—మీ మేజరు అనేది నిజంగా అంటున్నాడంటావా ? నన్ను అంత చిక్కులో పెడతాడంటావా ? అమాయకుణ్ణి ఒకణ్ణి అతనికి అప్పజెప్పడానికి ఒప్పుకోక పోతే, నా ప్రాణాలు పుచ్చుకుంటాడా ?

ఆటో

నాకేమీ సందేహం లేదు. ఒక మాటు నిశ్చయం చేసుకున్న తరవాత మనస్సు తిప్పుకోవడం అతనిలో నే నెన్నడూ చూడలేదు. అటువంటి ఆశ ఎంతమాత్రం కూడదు. మనకుండే ఆశంతా ఇంకొక చోట. మన మంతా కష్టపడి ప్రయత్నం చేదాము, మీరు క్లాస్‌ను అడగండి, నేను మా మనుష్యులను అడుగుతాను.

ఇజెబెల్

నేను పైకి వెళ్లవచ్చునా ?

ఆటో

నీ వెందుకు ?

ఇజబెల్

ఎందుకా ! వహావ్వా! మా నాన్నగారిని చంపడానికి సిద్ధంగా ఉన్నారు, నేను ఇంటి దగ్గిర హాయిగా కూర్చో వాలి కాబోలు ! ఊళ్లోకి వెళతాను; వీళ్లనూ వాళ్లనూ అడిగి చూస్తాను ; నాలుగు ప్రశ్నలూ వేస్తాను ; అన్ని రకాల ప్రయత్నం చేసి చూస్తాను...అందరమూ కూడా ఆలాగూ తంటాలు పడితే...

ఆటో

సరే అయితే నాతోరా, పైకివెళ్లడానికి పెర్మిట్ (చీటి) ఇప్పిస్తాను.

మేజిస్ట్రేటు

క్లాస్ అక్కడున్నాడా ఏమిటి ?

ఆటో

అతను ఎరస్టులో ఉన్నాడు, నామనుష్యులు కాపలా; ఇప్పుడే అతనిని మీదగ్గిరికి పంపిస్తాను.

(ఇజబెల్‌ను తీసుకొని వెళతాడు.)

సెక్రటరీ

'మేజిస్ట్రేటుగారూ,నాకుకూడా సెలవివ్వండి. షెరీఫ్‌నూ

ఇంకా మరి కొంతమందిని చూసి వస్తాను. వాళ్లు ఏమైనా చేయగలరనుకుంటాను.

మేజిస్ట్రేటు

ఆయితే వెళ్లమ్మా పియర్. (ఆదరంతో భుజంమీద చెయ్యి వేస్తాడు.) దుర్దినాలంటూ ప్రతివాడికీ వచ్చి తీరుతాయేమో!...అదుగో క్లాస్! నేనూ అతనూ మాట్లాడతాము కాస్సేపు; సరే నువ్వు వెళ్లమ్మా, వెళ్లు. (సెక్రిటరీ వెళతాడు. క్లాస్ ప్రవేశం—చించేసిన బట్టలు; తలనిండా, మొఖం నిండా గీర్లూ, దెబ్బలూ.)

క్లాస్

బాబూ, నమస్కారం.

మేజిస్ట్రేటు

ఏమిటమ్మా క్లాస్ పాపం!...అయ్యో, అయ్యో, ఇదేమిటి! ఏమిటి చేస్తున్నారు ఇంతసేపూ నీకూ?—ఆనోట్లో నుంచి రక్తం, నుదుటిమీద రక్తం!

క్లాస్

అంత ప్రమాదం ఏమీ లేదు. వాళ్లు ఏమిటి కావాలంటారో, అడిగేదేమిటో, చేయమనేదేమిటో, సాక్షు

కొంత సేపటి వరకూ అర్థమే అయింది కాదు; అందుకని నన్ను పట్టుకొని ఇటూ అటూ గుంజాయించారు. అంతే కంటే ప్రమాద మేమీ లేదు. చిరిగిపోయినది కూడా కొత్తకమీజు కాదు లెండి. పాత పంట్లాం ఒకటీ, అంత కంటే పాత కమీజు ఒకటీ తొడుగుకొని పొద్దున్న పనిమీదకి వెళ్లాను.

మే' స్త్రీటు

నీమీద వాళ్లు మోపిన నేరమేదో నీకు తెలుసునా?

క్లాస్

తెలుసును...గాని మొదటేమీ బోధపడలేదు. అప్పుడు అల్లుడుగారు బోధపరిస్తే తెలిసింది.

మే' స్త్రీటు

క్లాస్, నలభైఏళ్లబట్టి మనమిద్దరమూ కలిసి ఉన్నాము; నామీద నువ్వుగాని నీమీద నేనుగాని చెప్పవలసినది ఏదీ లేదు, నాకు అది తెలుసును. అయినా ఒక్క మాట అడుగుతాను కోప్పడకు. నీకు నామీద నమ్మకం ఉన్నదా?

క్లాస్

పూర్తిగా.

మేజిస్ట్రేటు

అయితే నీకు తెలిసినదంతా నాతో పూర్తిగా చెప్పు క్లాస్. ఏమీ జడవకు; నువ్వు చెప్పేది నాకు తప్ప మరెవ్వరికీ తెలియదు—ఇదే నామాట.

క్లాస్

నాకు తెలిసినది చాలా తక్కువ, గాని చెపుతాను వినండి. మీరు చెప్పినట్టుగా మొక్కలు పెంచుతున్న పూలతోటలోకి వెళ్లాను. ఆకులు కత్తిరించి సరిచేస్తూ ఉన్నాను—ఆ పని చేయవలసి వచ్చింది; కొన్ని మొక్కలకు ఇంతెత్తున రొడ్డ బలిసిపోయింది; మరి కొన్నిటికి పురుగు పట్టేస్తూ ఉంది...

మేజిస్ట్రేటు

పురుగా? వింతగా ఉందే! రెండు రోజుల క్రిందట చూశాను ఏమీ లేదే! ఆ పురుగును చంపే మందు ఇంకా మన దగ్గిర ఎంత ఉన్నది?

క్లాస్

ఒక గ్యాలనో ఎంతో ఉంటుంది.

మే' స్త్రీటు

అయితే ఏమీలా చాలదన్న మాట—రేపు మరికొంత తెప్పిస్తాను......ఆ—తరవాత ఏమయింది ?

క్లాస్

గుండు శబ్దం వినబడ్డది.

మే' స్త్రీటు

ఎటు పక్కనుంచి వచ్చింది ఆశబ్దం ? ఎంతదూరం నుంచి ?

క్లాస్

అట్టే ధూరం కాకూడదు. నేను పనిచేస్తుండే దగ్గిర నుంచి నలభై యాభై గజాలకు జాస్తీ ఉండదు.

మే' స్త్రీటు

తరవాత ఏమి జరిగిందీ ?

క్లాస్

తరవాతా ? పెద్దయుద్ధం అవుతూ ఉంటే, ఒక గుండు పేలినంత మాత్రాన నా గులాబీమొక్కలు వదిలేసి పారిపోవాలా అని నాలో నేను అనుకొని నా పని చేసుకుంటూ ఉన్నాను. అప్పుడు, కొంతెం సేపు కాగానే

ఆ దగ్గిర కేకలు వినబడ్డాయి. ఏమిటో చూదామని తోట లోనుంచి పైకి వచ్చాను. జర్మన్ సిపాయిలు నన్ను చూసి నా మీద పడ్డారు. పడి ఇటూ అటూ గుంజా యించేశారు; కొట్టారు; తిడుతూ శాబోలు, పెద్ద పెద్ద కేకలు వేశారు. తరవాత పెద్ద ఇంట్లోకి ఈడ్చుకుపోయి నారు. అప్పుడు అల్లుడుగారు నన్ను వాళ్ల చేతుల్లోనుంచి రక్షించి ఆ వితనాల గదిలో పెట్టి తాళం వేశారు.

మే'స్త్రీటు

తుపాకీ శబ్దం విన్నాక, ఆదగ్గిర ఎవరూ కనబడ లేదూ? ఆ చెట్ల మధ్య ఎవరూ పరుగెత్తి పారిపోవడం నువ్వు చూడలేదూ? ఏమీ కనబడ లేదా? ఇంకేమీ వినబడ లేదా?

క్లాస్

మీకు తెలుసునే, ఆ తోటచుట్టూ దట్టంగా కంచ లాగు తుప్పలూ రొడ్డా పెంచాము, ఆ అడవిలో ఏది జరిగినా లోపునుంచి ఏమీ కనబడదు.

మే'స్త్రీటు

మాలీలలోగాని తలిమ్మూ మన పనివాళ్లలో గాని ఎవరిమీదనైనా నీకు అనుమానం ఉన్నదా! అప్పుడో

లేక జోరుగా మాటలనే వాడు ఎవడైనా ఉన్నాడా, వాడు అనే దీన్నిదాన్నిబట్టి కూబీ లాగడానికి— మళ్లా చెపుతున్నాను నమ్ము—నువ్వు నాతో చెప్పేది ఏదీ కూడా మూడో మనిషికి తెలియదు.

క్లాస్

ఏ మాత్రం మాట జోరు ఉన్నవాళ్లూ, పౌరుషం కనపరచేవాళ్లూ పొగరుబోతులుఅన్నవాళ్లూ, వయస్సు మీారనివాళ్లూ, అందరూ కూడా సైన్యంలో చేరి వెళి పోయినారు. మిగిలినవాళ్లంతా మీాలాంటి నాలాంటి ముసలివాళ్లు మాత్రమే—వాళ్లకు బాగా తెలుసును భగవంతుడి ఇచ్ఛకు విరుద్ధంగా వెళ్లడం వెర్రిపని అనీ; జోరుచేయడం మన ముప్పుకే అనీ.

మేజిస్ట్రేటు

పోనీ, ఊళ్లోవాడు గాని పైవాడు గాని ఇటువంటి పని చేయగలిగిన పిచ్చివాడు, పొగరుబోతు, ఎవడైనా నీకు తెలిసినంతమట్టుకు ఉన్నాడా?

క్లాస్

నేనేమీా చెప్పలేను, ఎంతో ఆలోచించాను. ఏమాత్రం బలం గాని వయస్సుగాని ఉన్నవాళ్లందరూ

వెళిపోయినారా— ఆపని చేయదగిన వాడు ఎవ్వడూ నాకు తట్టలేదు.

మే' స్ట్రీటు

క్లాస్, నువ్వు దైవభక్తి కలవాడవు, అది నాకు తెలుసును. నీ యందు నాకుండే ఆధరం కూడా అందువల్లనే. నువ్వు చెప్పిన దంతా నిజమే కదూ అతురాలా? తెలిసినదేమీ కొంచమైనా దాచ లేదు?

క్లాస్

ప్రమాణం చేసి చెపుతున్నాను, నేను చెప్పినది నిజం. అబద్ధం చెప్పి నరకంలోకి వెళ్లేవాడను కాను, నేను.

మే' స్ట్రీటు

నాకు తెలుసును నువ్వు చెప్పినదంతా నిజమని. నువ్వు చెపితే నేను నమ్మలేనిది ఏదీ లేదు. ప్రమాణం చేయడం అనవసరం గాని అంత నొక్కి అడగవలసి వచ్చింది—నీవు చెప్పేదానిని పట్టి ఉంటుంది నేను బ్రతకడమో చావడమో.

క్లాస్

మీరు చావడమా! అదేమిటది, ఆలాగు అంటున్నారేమిటి.!

మే' స్ట్రీటు

అయితే చెపుతాను విను. నువ్వు నిర్దోషి వని చెప్పి నేరస్థుడు ఒకణ్ణి స్వాయంత్రంలోగా నేను వాళ్లకు అప్పజెప్పకపోతే నీ స్థానే నన్ను చంపేస్తారట.

క్లాస్

మిమ్మల్నా! అదేమిటి! వీరారేమి చేశారు! అబ్బే ఉత్త మాట; నేను నమ్మను. అటు వంటి పని ఎవ్వరూ చేయరు...

మే' స్ట్రీటు

చేస్తారు క్లాస్, తప్పకుండా చేస్తారు, నీ కేమి తెలుసును, పాపం! ఏర్ షాత్ లో వాళ్లు చేసిన పని అదే. ప్రతి చోటా చేస్తూ ఉన్నదదే; ఇక్కడ కూడా చేయబోయేది అదే! ఆటోవ్ చెప్పాడు నాతో అదిమట్టుకు ఆపడం ఎవరి తరమూ కాదు అని.

ాస్

ఎప్పటికీ కానేరదు, చూస్తూఉందురూ! అంత ఘోరమైన అన్యాయం ఎప్పటికీ జరగదు. ఆ లెఫ్టెనెంట్ను చంపినవాడు దొరకుతాడు. మనము ఒకవేళ పట్టుకోలేక

పోతే వాడు ఈలాగని వింటే సిగ్గుతో దుఃఖపడి వచ్చి, "అపరాధం చేసినది నేను" అని వాళ్ల చేతులలో తనం తటతానే పట్టుబడతాడు......అదీ కాక పోతే మీరు తప్పించుకుపారిపోతారు. దానికి తగిన సహాయం ఆటో మీకు చేస్తాడు. ఎటువంటి సహాయం వస్తుందో చెప్ప లేను, గాని, మీరన్నంత ఘోరం జరగదు, భగవంతుడు ఎన్నటికీ జరగనివ్వడు....

## మే' స్త్రీటు

సత్యకాలం మనిషివి క్లాస్ నువ్వు. ఇటువంటివి లెక్క లేనన్ని జరగనిస్తున్నాడు. ఇటువంటి దేమిటి— ఈరోజుల్లో ఎటువంటి పనైనా జరగనిస్తున్నాడు. ఇంత కూ జరగ బోయేదంతా ఏమిటి? నా చావే కదూ! అంతకంటే ఘోరమైన సంగతేదీ జరగకపోతే మనము అదృష్టమంతులము అనుకోవచ్చును. తప్పించుకుపారిపో వడమనేది జరగని సంగతి కదా అను. మరేదీ మార్గం లేదని ఒక వేళ ఆటో నాకు అటువంటి సహాయం చేస్తా డనుకో. అప్పుడు ఏమౌతుందో తెలుసునా? నాకు తగి లే గుండు ఆటోకు తగులుతుంది. అదిమాత్రం ఏమి న్యాయం! ......గాని ఆశంతా పూర్తిగా పోలేదు.

ఆటో ఈపాటికి తనమనుష్యులను అడుగుతూ ఉంటాడు. వాళ్లు చెప్పేదాన్ని బట్టి ఏదైనా తేల వచ్చును. ఈలో పున నీవంతు పని చిన్నదొకటి నువ్వు చేయి. పనివాళ్లం దరినీ ఒకచోట పోగుచేసి వాళ్లతో మాట్లాడి చూడు. నువ్వంటే వాళ్లందరికీ కొంచెం భక్తి. నువ్వు చెప్పిన మాట వింటారు. సంగతంతా వాళ్లకు స్పష్టంగా బోధప రుచు. అపరాధి ఎవడో వాళ్లల్లో ఎవరికి తెలిసినా, చేయ వలసినపని అందరూ కలిసి చేయండి. ఎవరిమట్టుకు వాళ్లు తప్పించుకొని అపరాధిని బయలుపెట్టేయమని గాని తీసు కువెళ్లి అప్పజెప్పేయమని గాని కాదు నేననేది. ఫలా నాది చేయమని నేను చెప్పను, చెప్పలేను. ఏది ధర్మమో, ఏది న్యాయమో, ఏది మంచో, వాళ్లమట్టుకు వాళ్లు ఆలోచించుకొని చేయనీ.

## క్లాస్

వాళ్లతో మాట్లాడతాను, వాళ్లలోవాడు ఎవడివల్ల నైనా ఆ ఖూనీ జరిగిఉంటే, ఇప్పుడు వాడు చేయవల సి న పనితప్పక చేస్తాడు, చూస్తూ ఉండండి.

మే' స్త్రీటు

ఆ పామ్ వరాస్* లోకి అందరినీ మెల్లిగా రప్పించు—రాత్రి తుపానువల్ల చెడిపోయినదంతా బాగు చేయాలని అంటే అంతా వస్తారు. ఆటోతో నేను చెపుతాను, నువ్వు ఇటూ అటూ తిరగడానికి ఎటువంటి ఆటంకమూ లేకుండా ఏర్పాటు చేయమని—ఇదుగో! అనే సరికి వచ్చాడు.

(ఆటో ప్రవేశం.)

మే' స్త్రీటు

ఆటో, క్లాస్‌ను అన్నివిధాలా అడిగాను. నేననుకున్నట్టుగానే అతనికి ఈవిషయమై ఏమీ తెలియదు. నేను చెప్పలేదూ—నీదీగాని నాదిగాని ఎంత అపరాధమో అతనిది కూడా అంతే అని. నీ పూచీ మీద అతనిని కాస్సేపు ఇటూ అటూ ఏమీ అడ్డులేకుండా తిరగనీయగలవూ? కూలీల దగ్గిరికీ, మాలీల దగ్గిరకీ వెళ్లి మాట్లాడి చూస్తాడు, ఈ కూనీ చేసిన వాడి జాడ ఏమైనా దొరుకుతుందేమో?

---

* పామ్ అనే ఒక మొక్క పేరు క్రోటన్; ఆ క్రోటన్‌లు అన్నీ ఒక్కచోట చేర్చి ఉంచే ఇల్లు.

ఆటో

ఓ, నిరాటంకంగా! అతనంటే నా కేమీ అనమ్మకం లేదు. నాతో రా అమ్మా, క్లాస్. దానికి కావలసిన చీటీ ఇప్పిస్తాను.

(క్లాస్‌తో కలిసి వెళతాడు)

మేస్త్రీటు

(వాచీ పైకి తీసి స్టాండు గడియారం వైపు చూస్తూ) అబ్బా! మూడు ఘంటలు! ఇక అట్టే వేళలేదు. (ఆటో ప్రవేశం.) నీ ప్రయత్నాలవల్ల తెలిసిన దేమిటి చెప్పుమీ కొంచం.

ఆటో

నాకు మునపటంత గాఢంగా లేదు ఇప్పుడు. గాని సమస్తమూ మీరు చేసేదానినిబట్టి అనే దానిని బట్టి ఉంటుంది. మొదటి సంగతి ఏమిటంటే ఈ ఉరి డాక్టరుగారు పోస్ట్ మార్టమ్* చేసి చూశారు. గుండు మొదట మెడకు తగిలి మెదడులో దూరి నుదుటి లోనుంచి వెళిపోయిందట. గుండేమో దొరక లేదు, గాని

*పోస్ట్ మార్టమ్ – శవాన్ని కోసి పరీక్షచేయడం.

దెబ్బనుపట్టి చూస్తే యుద్ధపు గుండే అని తెలుస్తూ ఉందట.

మే’ స్ట్రీటు

కొంత నయమే, అయితే—మామూలు వేటతుపాకీ కాదని దాని వల్ల స్పష్టమవుతూ ఉంది కదా!

ఆటో

గాని అది రివాల్వర్ గుండు వల్ల తగిలిన దెబ్బ కావచ్చును. కాక—ఇది మా సిపాయిలు ఎవరూ చేసిన పని అని నేను నమ్మను. ఆ గుండుశబ్దం వినబడేసరికి మా సిపాయిలు నూటయాభైమంది మాత్రమే ఇక్కడ ఉన్నారు, మొట్టమొదట వచ్చిన ఆరుగురూ కాక. ఆ నూటయాభైమందీ తుపాకులు అప్పటికి బారాకాసులో కుప్ప చేసి ఉంచేశారు, ఒక్కడైనా బారాకాసు వదిలి వెళ్ల లేదు. ముందువచ్చిన ఆరుగురినీ మాత్రం మీ గుర్రపుసాల దగ్గిర ఫారా వేశాము. ఈ ఆరుగురే ఆస్థలానికి పరుగెత్తుకొని వచ్చారు, గాని అది గుండు పేలిన తరవాత. ఆ ఆరుగురి తుపాకులు నా కళ్లతో నేనే తనిఖీచేసి చూశాను, ఉదయం ఉపయోగించినవాటి లాగు కనబడనే, కనబడవు, చమురుతో నిగ

నిగలాడుతూ ఇప్పుడే ఫ్యాక్టరీనుంచి వచ్చిన వాటి లాగు ఉన్నాయి.

మే' స్త్రీటు

తుపాకీ నాళా మెరుగుపెట్టడం ఎంత సేపు?

ఆటో

నిజమే గాని ఒక్క సంగతి ఎందుకు జ్ఞాపకం ఉంచుకోరూ? కళ్లతో చూచినట్టుగా రుజువు, ఏవిధంగా తిప్పినా కొట్టిపారేయడానికి వీలులేనిది, రాకపోతే మా మేజరు తన మనిషి ఇటువంటి పని చేస్తాడని ఒప్పుకుంటాడూ?

మే' స్త్రీటు

నీవనేది, అటువంటి ఆశ పెట్టుకోకూడదనా?

ఆటో

ఆశవల్ల ప్రయోజనం లేదని నా భయం.

మే' స్త్రీటు

ఏ తోవను వెళదామన్నా అడ్డే. ఇదివరకు అడ్డైన దార్లకు ఇదొకటి కలపాలన్న మాట... మేజర్‌ని గాని మాళ్లా చుశావా ఏమిటి?

ఆటో

ఆ, చూశాను; ఆయన మాటలనుబట్టి నాకు బాగా ఆశగానే ఉన్నది. గాని అంతా మీచేతులో ఉన్నది... సరే, మొదట ఈ పని అయిపోనివ్వండి. ఆయన నాచేతి కిచ్చారు ఈ ప్రకటన, మీచేత సంతకం చేయించమని— అప్పుడే అచ్చుపడి తయారుగా ఉన్నది, ఊరీ నిండా అంటించేస్తారు.

మే'స్ట్రీటు

అదేమిటో చూడనీ'.

ఆటో

చదువుతాను వినండి—" జర్మనీ సేనాధిపతులలో ఒక నిని దొంగతనంగా తుచ్ఛు డెవడో చంపినందువల్ల ఎవ రైనా వాణ్ణిపట్టి ఈరోజు రాత్రి ఏడు ఘుంటల లోగా మాకు అప్పజెప్పని పక్షమందు, దీనంతటికీ జబాబ్‌దారి స్టీల్‌మాంద్ మేజస్ట్రేటువారిది గనుక, ఆయనను పై చెప్పిన ఘుంటకు అందరిఎదుటా తుపాకితో కొట్టేస్తూ ఉన్నాము. ఇకముందు ఇటువంటి పని తిరిగీ ఎవరైనా చేయ ప్రయత్నిస్తే ఊరంతా కొల్లబెట్టి తగులబెట్టబోతు న్నాము; ఊళ్లో ఉండే పురుషులను జమచేసి వరుసగా

నిలబెట్టి పదేసి మందికి ఒక్కొక్కడి చొప్పున చంపబో తున్నాము."

మేజిస్ట్రేటు

అది నేను సంతకం చేయాలంటాడా, మీ మేజర్?

ఆటో

ఆ చేయాలి; మీరు చేసినట్టే భావించాడు; మీ పేరు ఆ కాగితంలో అచ్చుపడి పోయింది అప్పుడే!

మేజిస్ట్రేటు

ఆలాంటప్పుడు నన్ను అడగకపోతే చాలా బాగా ఉండును.

ఆటో

అంతకంటే కొంచెం పద్ధతిప్రకారం ఉండాలనిన్నీ, ఏమీ హెచ్చు తగ్గు ఉండకూడ దనిన్నీ.

మేజిస్ట్రేటు

నేను సంతకం పెట్టక పోతే?

ఆటో

దాని వల్ల మీకు వచ్చే దేమీ లేదు. మీ సంతకం

లేకుండానే ఆయన పని జరుపుకుంటాడు ; చేయలేదన్న కోపం మాత్రం ఎప్పటికీ మరవడు.

మే'స్ట్రీటు

చంపడం కంటే ఎక్కువ ఏమిటి చేయగలడు ?

ఆటో

ఆయన చంపగలిగినది మీరొక్కరే కారు, ఆ మాట మరిచిపోకండి.

మే'స్ట్రీటు

అవును, నిజమే ఇంతకూ సంతకము చేయడం వల్ల ఇంకెవరికీ అపకారం చేయడం లేదు కదా ! నా చావు వారంటే నేను సంతకం చేస్తూ ఉన్నది. (సంతకం చేసి ఇచ్చేస్తూ) అన్నహ్, అయిందా ? గాని కొంచెం ఉండు —దానిలో ఉండే వ్యాకరణం తప్పులు కొంచెం సరి చేసి ఇచ్చేదా ?

ఆటో

అటువంటి పని ఏదీ చేయకండి. అది కేవలం నిర్ధుష్టం అని ఆయన నమ్మకం.

మే' స్త్రీటు

అయితే ఇక వీలు రాయడం తప్ప నేను చేయవలసిన దేమీా లేదు. వీలుకూడా రాసేసే ఉంది; వీళ్లకూవాళ్ల కూ రాయించిన వాట్లో కొంచెం మార్పులు మాత్రం చేస్తాను.

ఆటో

అటువంటి మాటలాడకండి. ధైర్యం విడిచిపెట్టకండి. తప్పించుకొనే మార్గాలు ఇంకా చాలా ఉన్నాయి.

మే' స్త్రీటు

నిజంగానే ? నాకొకటీ కనబడకుండా ఉందే!

ఆటో

అయితే మొదటి నుంచీ చెపుతాను వినండి. లెఫ్టెనెంట్ గారిని చంపినది మీా క్లాసే అని మా మేజర్ గారి నమ్మకం. మీారు చివరవరకూ వాడు నిర్దోషి అని గట్టిగా చెపుతూ ఉంటే మీాతోపాటు అతన్ని కూడా చంప సాహసం గలవాడే ఆయన. తగిన శిక్ష కాకుండా క్లాషును మీారు ఏవిధంగానైనా రక్షించ నిశ్చయించుకున్నారని ఎలాగో ఆయనకు నమ్మకం బాగా పట్టిపోయింది. మిమ్మ

ల్ని చంపుదామని ఆయన నిజంగా అంత పట్టుదలగా లేడు, నాకు తెలుసును. మీ మీద ఎటువంటి ద్వేష మూ లేదు, ఆయనకు.

మే'స్ట్రీటు

అవును చాలా మంచివాఁడు.

ఆటో

అయితే, నలుగురికీ బుద్ధివచ్చేటట్టుగా అతను ఏమైనా చేయవలసి ఉంటుంది. అది మాత్రం నిశ్చయం చేసుకు న్నాడు. ఏదోఒకటి చేసి తీరుతాడు. ఆయన చేసే పని మంచిదే అని నాఉద్దేశం కూడాను. కావలస్తే క్లాసే నేర స్థుడని మీ నోటితో మీరే చెప్పవలసిందని కోరడం కూడా మానేస్తాడు. మీరు ఏమీ చేయకుండా మాటా డకఊరకుంటే చాలు. క్లాస్ నిరపరాధి, అమాయకుడు, అని గడబడ చేయకూడదు. నాకేమీ అక్కర లేదని మీరు కూర్చుంటే చాలు.

మే'స్ట్రీటు

వహ్వా ! నీవు ఏమిటి చేదువు, నేనుండే అవస్థలోనే నీవుంటే ?

ఆటో

నేనేమీ వెనకకు తీయను. ఏలాగు చూసుకున్నా సంగతి ఇంతే—ఉన్నదంతా ఏమీ ఎరగనివాళ్లు ఇద్దరు. ఆ ఇద్దరిలో ఎక్కువ నిర్దోషి అయిన మీారు ఎందుకు అనుభవించాలి, ఆ అనుభవించేదేదో? ఇంతకూ మనము చేస్తూ ఉన్నది యుద్ధం; యుద్ధంలో వచ్చే అదృష్టదుర దృష్టాలు వేరు, రోజూ మనము చూస్తూఉండే అదృష్టాలు వేరు. దురదృష్టం వచ్చి మీాదపడుతూ ఉంటే చేయవల సినదంతా ఏమిటి? మాట్లాడక అనుభవించడం, ఇతరు లను అని ఏమి ప్రయోజనం? ఏదైనా ఒక వంతెన విరిగి పడడమువల్ల పాతిక మంది కింద కూరుకు పోయి చస్తా రనుకోండి; ఒక ఫ్యాక్టరీ చిమ్నీ కూలిపడి పదిమందిని పాతాళంలోకి తొక్కేస్తుందనుకోండి—అందుకని వీణ్ణీ వాణ్ణీ దూషిస్తే ఎంత తెలివో మనకు ప్రాప్తించిన దుర దృష్టాలకని తిట్టినా అంతే తెలివి!

మేజిస్ట్రేటు

నీవు చెప్పేదంతా నా బుద్ధికి అగోచరం, అతిసూక్ష్మం గా ఉంది. నాకు కనబడే దంతా ఒక్కటే, బోధపడేదం తా ఒక్కటే—క్లాస్ ఎటువంటి అపరాధమూ ఎరగని

వాడు. ఆ మాట నేను పైకి అనకుండా ఉంటే, క్లాస్ అపరాధం చేశాడు అని నేను అక్షరాలా అన్నట్టే లెక్క. ఈలాగని మీ మేజర్ గారు అన్న మాటే కదా! తప్పేమీ చేయ లేదని నాకు బాగా తెలిసిన ఎవణ్ణో ఒకణ్ణి నా ప్రాణాలు దక్కించుకోడానికి మీ తుపాకులకు బలిగా ఇవ్వాలి అని దాని అర్థం. మీ జర్మన్ భాషలో అటువంటి పనికి పేరున్నదా?

ఆటో

బోధపరుచుకో నని మీరు నిశ్చయించు కున్నారు. ఏలాగు చూసినా మీ మతం ప్రకారం ఒక అన్యాయం జరగక మానదు అన్నమాట. మిగిలినదంతా ఏమిటి— ఆ అన్యాయం ఎవరిమీద పడడం, మీ మీదానా, క్లాసు మీదానా అని? మీరే ఎందుకు చావాలి, అతను ఎందుకు కూడదూ?

మేస్ట్రీటు

అతనెందుకు చావాలమ్మా, నేనెందుకు కూడదు?

ఆటో

విధి.నిర్ణయించింది గనుక—విధి అనకపోతే కర్మం,

దురదృష్టం, మీా ఇష్టం వచ్చిన పేరు పెట్టండి; ఆతని చావుకు మీారెంత మాత్రం కారకులు కారు. "ఇదుగో ఇక్కడున్నాను, ఇక్కడా, అదిచేసినది నేనూ—నన్ను చంపండి" *అని కేకలు వేసుకుంటూ మీారు ఎందుకు పరుగెత్తుకొని రావాలో నాకు బోధపడకుండా ఉంది. ఇది నాటకమా ఏమిటి? అటువంటి ధీరత్వంకనపరచడానికి ఇది సమయమూ కాదు స్థలమూ కాదు.

మే'స్త్రీటు

సరీగా చెప్పావు. క్లాసును రక్షిద్దామని మీారు మేజరుగారి దగ్గిరికి వెళ్లి "అయ్యా మరి మీారు అవస్థపడకండి, చంపినది నేను." అని చెపితే నువ్వు అన్నట్టుగానే ఉంటుంది, నాటకంలోలాగు. అటువంటి ధీరత్వానికి తగిన తెలివితేటలు నాకు లేవు. నాకూ ధీరత్వానికీ చాలా దూరం. ఏదో సామాన్య సంసారిని, ఊరిలో ఉండే నలుగురు తగుమనుష్యులలాగూ మర్యాదాగా కాలం గడుపుకుంటున్నాను. అందరి లాగే చావంటే నాకూ భయమే; బ్రతికిఉండడం అంటే అందరి మోస్తరు నాకూ ఆశే;

*ఒక గ్రీసుదేశపు నాటకంలో నిస్సిస్ అనే ఒకపాత్ర అన్న మాటలు.

నాకుండే ఆశ అందరికంటే అధికం కూడా అయి ఉండ వచ్చు—ఎందుకంటే, సుఖం అందరి కంటే విస్తారం అను భవించాను, ఇంత సుఖానికి నేను అర్హుడనా అనిపించేది. మిగిలిన రోజులు కూడా అతి నెమ్మదిగానూ హాయిగానూ ఆఖరివరకూ గడపాలని ఉన్నది. గాని హాయి కోసమని ధర్మం వదలను— ధర్మం వదిలితే హాయి ఎక్కడ ?... విధి నిర్ణయించింది, నాపూచీ కాదు, అనుకొని కేవలం నిరపరాధి అని తెలుస్తూ ఉన్న క్లాసును అప్పజెప్పేయ మని అంత సులభంగా అనేయగలిగావే — నన్ను మాత్రం విధి ఎంచి ఉంచలేదూ? ఆ కూనీ జరిగిన స్థలానికి సమీపంలో ఉండడం అతని ప్రారబ్ధం అయితే, ఇంత భయంకరమైన ఆపద సమయంలో ఇంత గొప్ప పూచీతో ఈ ఊరికి అధికారిగా ఉండడం తటస్థించడం నా ప్రారబ్ధం. ప్రారబ్ధం అనుకున్నా, మా ఇద్దరిదీ ఒక్కటే అవస్థ; విధి పేరుచెప్పి తప్పించుకోవడమన్నా ఒక్కటే. నా చేతిలోఉండే శక్తీ, నా మాటకుండే విలువా క్లాసుకే ఉండి, నాకు చావో బ్రతుకో కేవలం అతని ఒక్కడి మాట మీదే ఉన్నప్పుడు, నేను నిర్దోషిని అని తెలిసి నప్పటికీ నామీద అపరాధం వేస్తే, మీరందరూ అతన్నిని

ఏమందురు? నీచులలో అధముడని అనరూ? అయినా ఆ అధముడు చేసిఉండిన పని ఏమిటి, నన్ను ఇప్పుడు నీవు చేయమంటున్న పనే. మా ఇద్దరినీ చూస్తూ'న్నది ఒక్క విధే. తప్పించుకుపారిపో'డానికి ఇద్దరికిఉన్న అవకాశాలూ ఒక్కలాంటివే. తనను తాను కాపాడుకో లేనటువంటి ఒక అమాయకుణ్ణి, పూర్తిగా నామీద నమ్మకం గల్గి వాణ్ణి, వంచించి శత్రువుకు అప్పజెప్పి నన్ను తప్పించుకుపారిపోమని కదా నువ్వు చెప్పిన బోధంతా. అటువంటి పని అనుకో'నైనా అనుకో'కూడదని దన్న మాట్ల, గాని, ఒప్పుకో'డానికి సంతో'షంగానే ఉంటుంది. నీకు ఇది ఎందుకు బోధపడకుండా ఉందో నాకు తెలియకుండా ఉంది.

ఆటో

ఇక వాదన మానేయడం ఉత్తమం ; దాని వల్ల ప్రయోజనం లేదు ; మీకు సబబు అక్కరలేదని స్పష్టం......సరే, మీరిద్దరూ ఒక్క అవస్థలో ఉన్నారని ఒప్పుకుందాము. ఇద్దరి ప్రాణాల్లో ఒకటి ఎంచుకోవాలి. మీది విలువైనదా అతనిది విలువైనదా అని ఆలోచించుదాము. మీరు లేనిదే ఎన్నో పనులకు భంగం

మీరు పది మందికి సహాయం చేయదగిన వారు, చేస్తూ ఉన్నవారు. అతను—అతని కెవరున్నారు ? ఒకపిల్లలా లేరు, ఒకబంధువులా లేరు, చస్తే ఏడిచే వాళ్లైనా లేరు ; నలుగురికీ ఉపయోగమైనది ఒక దమ్మిడీ అంతైనా చేయలేదు, ఇక నాలుగురోజులు పోతే అందరికీ బరువు చేటు కూడాను !

## మేజిస్ట్రేటు

నా ప్రాణం ఎంత విలువైనదో నాక్లాస్ ప్రాణం కూడా అంత విలువైనదే! క్లాస్ అబద్ధం అంటే ఏమిటో తెలియకుండా అతి అభిమానంతో పనిచేసే మనిషి. కాకుండా, పరమ దొంగ, పరమ లుచ్ఛా అయినా, నేను చెప్పేది ఇంకొక మోస్తరయి ఉండదు. ఇటువంటప్పుడు చేయువలసిన పని ఎవరి విలువ ఎంత, ఎవరి ఉపయోగం ఎంత అని తూస్తూ కూర్చోడం కాదు—అసత్యంతోనూ అధర్మంతోనూ తన జీవితానికి కళంకం తెచ్చుకోవడమో లేదో నిశ్చయించు కోవడం.

## ఆటో

నా మతి పోతూఉంది ! పూర్వము మీాకుండే వివేకమూ, నేర్పూ, లోకానుభవమూ, మొదలైన గుణాలన్నీ

చూసి అటువంటివారు కొమార్తె నివ్వడమువల్ల నా కెంతో గౌరవము కలిగిందని సంతోషించాను. ఆ గుణాలన్నీ ఇప్పుడు ఏవీ? మునపటి మనిషిలాగే లేరే!

మే. స్త్రీటు

నా కూతుర్ని ఎటువంటి వాడికి ఇస్తూన్నానో నే నేమీ తెలుసుకోలేకపోయినాను.

ఆటో

మీ అంత బేసబబుగా నేను మాట్లాడను. మీకంటే న్యాయంగా ఉంటాను; మీరు వద్దంటున్నప్పటికీ మీ ప్రాణాలు కాపాడ గలనని ఆశ ఇంకా నన్ను వదలలేదు. ఆలోచించుకోడానికి ఇంకా వేళఉంది—ఇంకా మూడు ఘంటల వేళ ఉంది. మీకు ఏది ఇష్టమో ఇప్పుడప్పుడే నిశ్చయించాలన్న నిర్బంధం లేదు. ఆఖరి క్షణంవరకూ ఆలోచించుకోవచ్చు. దానికి తగిన ఏర్పాటంతా నేను చేస్తాను.

మే. స్త్రీటు

నేను కోరబోయేది ఇది వరకే నిశ్చయంచేసుకున్నాను. నా అవస్థలో మనిషి అన్నవాడు ఎవడుఉన్నా,

నేను చేయబోయేదే చేస్తాడు అని, ఆలోచించినకొలదీ మరింత స్పష్టం అవుతూఉంది. ఇంకొక లాగు చేయడం ఊహించడానికైనా సాధ్యం కాదు. (క్లాస్ ప్రవేశం) ఓహో! ఇదుగో క్లాస్ వస్తున్నాడు, ఏదో భోగట్టా తీసుకొని! మనము ఇంతసేపూ చేస్తూఉన్న వాదనంతా నిష్ప్రయోజనం అనిపిస్తాడు బహుశా! ఏమయింది క్లాస్, ఏమైనా తెలిసిందా?

క్లాస్

చెపుతున్నాను ఇదుగో. నా మాలీలందరినీ ఆ పామ్ హౌస్ లోకి రమ్మన్నాను. అందరూ వచ్చారు; అక్కడికి రానివాళ్లల్లా జబ్బుతో పడిఉన్న ఆ తాత ఒకడున్నూ, నెలరోజులకిందట పని విడిచిపెట్టి వెళిపోయిన ఆ కుర్ర వాడున్నూ. ఇప్పటివరకూ జరిగినదంతా వాళ్లతో చెప్పాను. ఇకముందు జరగబోయేదీ చెప్పాను. బోధపరుచుకున్నారు; కోపంతో మండిపడి పోయినారు. వాళ్లకేమీ తెలియదు. ఈలాంటిది చేతా కాదు, చేయా లేదు వాళ్లు; అది నాకు స్పష్టంగా కనబడుతూఉంది. అపరాధిగానీ వాళ్లల్లో ఎవడైనా అయిఉంటే, అందరూ కలిసి విచారణచేసి నిందమోపినదాకా వాడు ఉండకపోను,

తనంతట తానే అప్పగించేసుకొని ఉందును. ప్రతివాడి కళ్లవెంట నీళ్లధారలు. వాళ్ల మనస్సులలో ఏముందో చెప్పేదా? చెప్పను, చెప్పను; ఆటోగారి ముందర చెప్ప కూడదు.

మేజిస్ట్రేటు

అది నాకు ఇంతకుముందే తెలుసును.

క్లాస్

అయితే ఒక చిన్న మనవి. మీ సెలవయితే, అది ఆటో గారి ఎదుటే చెపుతాను. కాకపోతే ఆయన వారి మేజరుగారితో చెప్పవన్ను.

మేజిస్ట్రేటు

ఏమిటి చెప్పు, క్లాస్.

క్లాస్

ఏమిట్రంటే: నేను బాగా ఆలోచించి చూశాను. నేను ముసలివాణ్ణి, ఈ నెలాఖరుకు అరవైమూడు నిండుతాయి. పెళ్లామూ పోయింది; పిల్లలూ లేరు; ఎటువంటి సౌఖ్యమూ లేదు; నానా బాధలూ పడుతు న్నాను. ఇక అట్టే రోజులు ఏలాగు బ్రతకను. ఈ

నాలుగు రోజులూ బ్రతికి ఏమి మహా చేసేయాలి. అందు కని బాగా ఆలోచించి నాలో నే ననుకున్నాను— "చూశావ్రా, అబ్బాయి, క్లాస్, ఆ లెఫ్టెనెంటును చంపిన జాగాకు దగ్గిరగా వాళ్లకు కనబడినందుకు, ఈ మాటు వాళ్లు అడిగేటప్పుడు నేను అతన్ని చంపలేదు అని అనకు, చాలా బాగుంటుంది." అని.

ఆటో

అయితే చంపినట్టుగా ఒప్పుకుంటున్నావన్న మాట.

క్లాస్

లేదు. అది నోటితో ఏలాగు చెప్పగలను, నేను చంపనిదే ? నువ్వుచంపావు అని ఈమాటు వాళ్లు అన్నప్పుడు ఏమీ అనకుండా ఊరుకుంటాను. లేకపోతే మేజరుగారితో వెళ్లి చెప్తాను—'మా మే'స్ట్రీటుగారికి బదులుగా నన్ను చంపేయండి; మా మే'స్ట్రీటుగారు ప్రతి వాళ్లకూ అవసరం, అందులో ఈలాంటి సమయంలో మరీని; నేను బ్రతికి ఉండడం ఎవరికీ అట్టే ఉపయోగమైన సంగతి కాదు, అని.

ఆటో

చూశారా? నే నన్నట్టుగానే అన్నాడా సరిగా!

ఇక మీ రేమీ సంకోచించకండి. పాపం, ఈ ముసలివా డికి తెలుసును—తాను చేయవలసినదేమిటో మీరు చేయవలసినదేమిటో, మీకంటే బాగా తెలుసును. ఈలారా క్లాస్, నాకు చాలా సంతోషంగా ఉంది. నీ చెయ్యి ఒకమాటు పట్టుకోనీ. (దగ్గరికి వెళుతూ చెయ్యి ఇవ్వబోతాడు)

క్లాస్

(చెయ్యి వెనకకు తీసుకుంటూ) వద్దు బాబూ, వద్దు; ఇంతసేపూ తవ్వుతున్నాను, మీ చేతులు మురికి అవు తాయి, పట్టుకోకండి.

మేజిస్ట్రేటు

ఒక్క నీ రెండు చేతులే పట్టుకోవడం కాదు— ఉండనీ ఎంత మన్ను ఉంటుందో—నిన్ను గట్టిగా కౌగ లించు కుంటాను. సాక్షాత్తు నాతమ్ముడివైతే ఏలాగు కౌగలించుకుంటానో ఆలాగు. (దగ్గరికి వెళ్లి గట్టిగా కౌగలించు కుంటాడు :) సరే గాని. ఇక మాత్రం ఆమా టలన్నీ మరి అనకూడదు, తెలుసునా క్లాస్? నీవు అన్నది విని నా మనస్సు కరిగిపోతూ ఉంది; ఆనందంతో నిండి పోతూ ఉంది, ఆలాగు అనడం నాకేమీ ఆశ్చర్యం

గా లేదు. గాని అది ఎప్పటికీ జరగని పని. మొట్టమొదటి సంగతేమిటంటే నీవు నాకోసం ప్రాణం విడిచిపెడుతూ ఉంటే చూస్తూ ఊరుకోడానికి నాకు అధికారం లేదు. నీవు అటువంటిది చేయపూనుకోవడం మహా గొప్ప సంగతి, గాని నేను మాటాడకుండా ఇక్కడ కూర్చొని చూస్తూ ఉండడం కంటే నీచమైన పనీ, హేయమైన పనీ మరి ఉండదు. ఇంతకూ నేను ఒప్పుకున్నా, అతురాలా "నేను అతనిని చంపాను" అని నీవు అనకపోతే మేజర్ ఒప్పుకోడు. అతను కోరుతూ ఉండేది నీప్రాణం కాదు, అందరికీ బుద్ధిచెప్పాలని నా ప్రాణం, లేక ఆకూనీ చేసిన వాని ప్రాణం.

క్లాస్

మిమ్మల్ని విడిచిపెట్టి నన్ను పట్టుకోడానికి ఏమి అన వలసి ఉంటే అదే అంటాను.

ఆటో

(మేస్త్రీటుగారితో) ఆలాగైతే మా మేజర్‌గారు ఒప్పుకుంటారు. దానికి నేను పూచీ. అదంతా నాకు విడిచిపెట్టండి; ఇక మీకేమీ భయం లేదనే లెక్క వేసుకోండి.

మే' స్త్రీటు

అయితే ఏమయింది? చుట్టు తిరిగి మొదటికే వచ్చిం ది—ఏమీ ఎరగని వాణ్ణి చావు నోటికి అప్పజెప్పమని దాని అర్థం. ఆ అర్థం నాకు కనబడకుండా మీరు ప్రయ త్నంచేస్తూఉన్న కొలదీ నేను చేయవలసిన పని నాకు మరింత స్పష్టం అవుతూఉంది. నిరపరాధినిఅని చెపుతూ నాస్థానే చచ్చిపోతానంటే నేను ఒప్పుకోనప్పుడు నిరప రాధి అని నాకు తెలుస్తూ ఉన్నప్పటికీ అపరాధిని అని చెప్పి చచ్చిపోడానికి సిద్ధపడితే మరీ ఒప్పుకోను. దీనివల్ల ఒకటి కాదు, రెండు నీచమైన పనులు చేసినవాణ్ణి అవు తాను.

ఆటో

(క్లాసును చెయ్యిపట్టి లాగుతూ) రా, క్లాస్, ఆయన వద్దంటూఉన్నా మనము వెళ్లి ఆయనను ఏలాగైనా కాపాడదాము. రా, మేజరుగారి దగ్గిరికి వెళదాము రా.

మే' స్త్రీటు

క్లాస్, ఇదుగో చూడు, ఆగు. నేనంటే నీకు అతిప్రేమ నాకు తెలుసును. దానికి చక్కని నిదర్శనం. నీవు ఇప్పుడు చేస్తానన్నదే. అంతకంటే స్పష్టమైన నిదర్శనం నాకు ఇం

కెవ్వరిలోనూ కనబడలేదు. అటువంటిది ఇంకొక్కటి కోరతాను—బహుశా దానికంటే కష్టమైనది—గాని అదే ఆఖరిది. ఏమయినప్పటికీ మేజర్ దగ్గిరికి వెళ్లకూడదు—వెళ్లను అని ఒప్పుకొని మరీ వెళ్లు ఇక్కడనుంచి.

క్లాస్

(వెక్కి వెక్కి ఏడుస్తూ) మీరు నాకు తండ్రి. ఏది మంచో ఏది చెడ్డో మీకు తెలుసును, నాకు తెలియదు. ......(కన్నీళ్లు తుడుచుకుంటూ—మరింత పట్టలేకుండా) గాని నేనన్నది మనస్ఫూర్తిగా అతి సంతోషంతో అన్నాను.

మే'స్ట్రీటు

(అతనిని దగ్గిరికి తీసుకొని, గట్టిగా కౌగలించుకొని) ఇదే ఆఖరుమాటు క్లాస్.

క్లాస్

నమస్కారం...

ఆటో

ఇందులో ఒక్కమాటైనా బోధపడడం లేదు నాకు. నేను చస్తాను నేను చస్తాను అని ఏమిటీ వెర్రి!

మేస్త్రీటు

వెర్రి కాదమ్మా ఆటో. మాదేశంలో అందరూచేసే పనే అది. మనిషి అనిపించుకోదగిన ప్రతివాడు చేస్తాడు ఆలాగు. (తలుపుమీద గుద్దు వినబడుతుంది) రండి, ఎవరో! (నౌకరు ప్రవేశం.) ఏమిటి సంగతి?

నౌకరు

మేజరు గారు మిమ్మల్ని ఆటో బాబునూ టౌన్ హాలుకు రమ్మని కబురు పంపించారు.

మేస్త్రీటు

ఔను అన్నట్టు, యుద్ధపుకప్పం సంగతీ, జరిమానా సంగతీ మరిచి పోతున్నాను. దాని కొక పెద్ద వాదన అవుతుంది. బహుశా నీవు సహాయం చేయవలసి ఉంటుంది, ఆటో; నీమీద నమ్మకం పెట్టుకున్నాను.

ఆటో

చేతనైనంతా చేస్తానుగాని సాధించ గలనని మాత్రం ధైర్యంగా చెప్పలేను. తాను అనుకున్నది తప్ప ఇంకొక మాస్టరు ఎవరి నోటా రానివ్వడు.

మే'స్త్రీటు

ఎంత వేళ అయింది? అయ్యో, నాలుగు దాటి పో యింది!——నా సంగతులే చూసుకుంటూ కూర్చున్నాను, ప్రపంచంలో నేను తప్ప ఇంకెవ్వరూ లేరన్నట్టుగా. ఇక నైనా మిగిలినవాళ్ల మాట ఆలోచించాలి.

(తెర)

## మూడో అంకం

---

మనుపటి స్థలమే

(మే'స్త్రీటు, సెక్రటరీ, ఇజబెల్, ఫ్లారిస్.)

మే'స్త్రీటు

నీవు ఆ మీటింగులో లేవు గనుక అక్కడ జరిగిన సంగతి చెపుతాను విను సెక్రటరీ. యుద్ధపు కప్పమూ, వాళ్ల లెఫ్టెనెంట్ చావుకని మనకు వేసిన జరిమానా నిశ్చయం చేశారు. కప్పానికని అయిదు వేల కాసులూ, జరిమానాకుగాను అయిదు లక్షలూ మనము చెల్లించవలసినదని మేజరుగారు అన్నారు.

ఫ్లారిస్

వాడి బుర్ర ఖరీదుకు వేయుంతలు.

మే'స్త్రీటు

దానికేమీ సందేహం లేదు! ...గాని నీవు ఊరుకో అమ్మా ఫ్లారిస్...ఎంతో కష్టంమీద అంతాకలిపి పది లక్షలకు ఒప్పించాను. రేపు మధ్యాహ్నం షన్నెండు

ఘంటలలోగా మనం ఇవ్వాలి. యాభై వేలు నగదు నా ఇనప పెట్టెలో ఉంది, అది మీరు తీసుకోండి. బ్యాంక్ వాళ్లు రెండు లక్షల యాభై వేలు ఇస్తారు. షెరిఫ్‌గారు యాభై వేలూ, మన రెండో కౌన్సిలరుగారు డభ్భై అయిదు వేలూ ఇస్తారు. ఇవన్నీ కలిసి సుమారు అయిదు లక్షలు అయినాయి. ఇదేమో నిఖరం. మనా రెండో షెరిఫ్‌గారు ప్రయత్నంచేసి మిగతాసొమ్ము తతిమ్మా కౌన్సిలర్ల వద్దనుంచీ, ఊళ్లో ఉండే పెద్దపెద్దవాళ్ల దగ్గిర నుంచీ తేవాలి. నీవు కూడా అతనికి కొంచం సహాయం చేయాలి. అయితే, అన్ని ఏర్పాట్లూ ఏదో ఒక విధంగా అయిపోయినాయి అన్నమాటే; ఇక నేను అట్టే భయం లేకుండా వెళిపోవచ్చును...మనకు వచ్చిన అవస్థ కష్టమైనదే గాని అన్ని విధాలా చూస్తే మాత్రం నేను అనుకున్న కంటే సులభంగా తేలిపోయినాము. ఈ ఆక్రమణ వల్ల మనకు కలిగే బాధ ఒక విస్తారం కింద లెక్క కాదు. ఒకవేళ అయినా, తతిమ్మా ఊళ్లల్లో జరుగుతూ ఉన్న దానినిబట్టి చూస్తే, ఎవరికైనా "ఆహా, స్టిల్ మ్యాందు వాళ్లు ఎంత హాయిగా ఉన్నారు; ఏమి పుణ్యం వాళ్లది!" అనిపిస్తుంది. ఈ ఉపకారం జరగడానికి కారణం ఛాలావరకు ఆటో వాళ్ల సైన్యంతో రావడమే.

మనతో ఏకంఅయిపోయినాడని చెప్పి వాళ్లు అతనిని చం పేసేటంత చేయలేదు గాని మిగిలినది ఎంత చేయాలో అంతా చేశాడు. అది మీ అందరి ముందు చెపుతు న్నాను—ధర్మంగా అనవలసినది అనాలి కదా, ఎవరి విషయమైనా!...షెరీఫులూ, కౌన్సిలర్లూ, తలిమ్మా మన స్నేహితులూ అందరి దగ్గిరా సెలవుతీసుకొని వచ్చాను. నాకు దుఃఖం వచ్చింది; మనస్సు ఒకమోస్తరు ఆనం దంతో నిండిపోయింది; వాళ్లందరికీ నాయందు అంత అభి మానమని నే నెప్పుడూ అనుకోలేదు. మన పెద్ద షెరిఫ్ గారిని చూస్తే నాకు నిజంగా ఏడుపు వచ్చింది—మనిషి అంత దుఃఖించడం నే నెప్పుడూ చూడలేదు. నన్ను పట్టు కొని వదలలేకపోయినాడు; నాస్థానే చచ్చిపోతాన న్నాడు. "మీ వంతు ఇంకా రాలేదు, ఆలాగు చేయడం అనవసరం; ఎన్నటికీ కాని సంగతి—" అని ఆయనకు నచ్చజెప్పే సరికి అతి కష్టం అయింది. బాప్టిస్టు మిషనరీగారు మీటింగు అయిపోయే వేళకు వచ్చి నాతోపాటు తనను కూడా ఎందుకు జామీనుగా తీసుకో లేదని అడిగారు; ఆగౌరవానికి నేను కూడా తగిన వాడనే అని అన్నారు. నా వంతు నాకు ఇవ్వమని ఆలాగు అడగడం—అహా, నాకు ఏలా'ఉండెనుకదా!...మేజర్ దానికి ఏమన్నాడు

తెలుసునా?—"మరి కాన్స్పేవు ఉండడంవల్ల నీకట్టే నష్టం కలగదులే" అని...ఎంత కరువై పోయినా ప్రపంచంలో మంచి అంతా పోలేదు. (గడియారం వైపు చూసి) అయిదు ఘంటల నర—ఇంకా ఘంటన్నర ఉన్నది. కాని నీవు చేయవలసినది చాలా ఉంది. వెళ్లి అది కొంచెం చూసుకో అమ్మా, పియర్. ఆటో వచ్చేవరకూ పిల్లలతో నేనుఇక్కడనే ఉంటాను...అన్నట్టు మన—ఆ దెబ్బతో వచ్చాడు, నీ స్నేహితుఁడు—ఆయనేమైనాడు? అతని మాట మరిచిపోయినాము, పాపం!

సెక్రటరీ

నౌకరు తీసుకు వెళ్లి అతనిని ఆ మోటార్ డ్రైవర్ గదిలో దాచాడు. ఇప్పుడే ఒక్క పావుఘంట కిందట చూసి వచ్చాను; చంటి పిల్లడి లాగు ఒంటి మీద తెలివి లేకుండా నిద్రపోతున్నాడు, పాపం!—జరుగుతూ ఉన్న సంగతేమీ తెలియదు అతనికి.

మేస్త్రీటు

మరీ మంచిది పోనీ, పాపం; ఇక ముందు మాత్రం ఎప్పుడూ అతనిని కాచుకొనే ఉండాలి సుమండీ!—

నన్ను వీళ్లు చంపేసిన తరువాత ఇతను ఏమైన సాహసం చేయగలడు!

సెక్రెటరీ

నేను అదంతా చూసు కుంటాను. మీరు అటు వంటి భయం ఏదీ పెట్టుకోకండి. మే'స్ట్రీటుగారూ, నమస్కారం... సెలవు, నమస్కారం.

మే'స్ట్రీటు

(సెక్రెటరీ చేతులు పట్టుకొని) నమస్కారం. తిరిగి కలుసు కుంటాము బహుశా. (సెక్రెటరీ వెళతాడు.) ఆఖరుమాట అడిగి చూదామని ఆటో మేజర్ దగ్గిరికి వెళ్లాడు, గాని ప్రయోజనం ఉంటుందని నాకు అట్టే ఆశ లేదు. ఏమమ్మా ఇజెబెల్, ఫ్లారిస్, ఇక మీతో నేనుండేది అట్టే సేపు లేదు—భయపడకండీ—నాలుగు మాటలు చెప్తాను వినండమ్మా. (ఇద్దరూ వెళ్లి తండ్రిని గట్టిగా పట్టుకుంటారు.)

ఇజెబెల్

నాన్నా! నాన్నా!

ఫ్లారిస్

నాన్నా!

మే'స్త్రీటు

(వాళ్ల తలమీదా, ఒంటి మీదా చేతులువేసి ముద్దు తో దువ్వుతూ) ఏడవకండి అమ్మా. ఏడవకూడదు... ఇప్పుడు ఆలాగు ఏడవ వచ్చునూ, ఇంకా ఏమీ కాలే దే!...కాని మనము ముందు జాగ్రత్తపడి ఉండాలి, అం తేను...నా వీలు ప్లీడరు గారి దగ్గిర ఉంచాను. ఆటో వల్ల ఏమీ చిక్కు గాకుండా కొన్ని యేర్పాట్లు చేయించ వలసి వచ్చింది—ఆటో ఎంతైనా మనవాడు కాడుగదా! జరిమానా కోసమని చెప్పిన యాభై వేలూ కాక, మరి పది వేలు మన ఇనపపెట్టెలో ఉన్నాయి. ఈ ప్రళయం తగ్గి మంచి రోజులు వచ్చే వరకూ అవి మీకు సరిపోతాయి. ఇదుగో అమ్మా, తాళంచెవి. ఇజెబెల్, ఈ పదివేల మాట ఆటోతోనైనా చెప్పకూడదు సుమా; నీవు కూడా ఏమీ అనకూడదు, ఫ్లారిస్. యుద్ధం అయిపోయిన తర వాత, ఇజెబెల్, నీ అవస్థ చాలా కష్టంగా ఉంటుంది. మన ప్రాంతాల ప్రజలు ఏదైనా చిరకాలం జ్ఞాపకం ఉంచుకుండే స్వభావం గలవాళ్లు. ద్వేషం చాలా తీవ్రం గా ఉంటుంది.—ఆటో తన మొఖం ఇక్కడ మరి కన బరచ లేదు.

ఫ్లారిస్

ఏ మొఖంతో వస్తాడు! ఏదీ ఏలా' వస్తాడో రానీ!

మే'స్ట్రీటు

ఛా ఛా, ఊరుకో ఫ్లారిస్, ఊరుకో, ఆలా' అన వచ్చునా?—అక్కయ్య అంటే కొంచెం కనికరం ఉండ నీ అమ్మా—ఏది ఏలాగైనా అక్కే కదా! ...ఇదుగో ఆటో వచ్చాడు—ఇప్పుడు ఏలాగుందో సంగతి చెపు తాడు. (ఆటో ప్రవేశం.)

ఇజేబెల్

(పరుగెత్తుకొని ఆటో దగ్గిరకి వెళ్లి) ఏమయింది, ఏమిటి చేసుకువచ్చారు, అతనికి బోధపడేటట్టు చెప్పారా?

ఆటో

ఏమీ చేయలేకపోయినాను. బ్రతిమాలుకున్నాను, అడుక్కున్నాను, చివరకు కాళ్లమీద పడ్డాను. మా జర్మన్‌దేశస్థుడు ఇంకెవ్వడూ కూడా ఎప్పుడూ చేయాడు, ఆలాంటి పనులన్నీ చేశాను. ఏమీ కార్యం లేకపోయిం ది, నిష్ప్రయోజనం. నేను ఇక మరి నోరు విప్పకూడ

దన్నంత కఠినంగా చివరకు అన్నాడు, మాటలు చాలించ మని.

ఇజెబెల్

వెళ్లి మళ్లీ ప్రయత్నం చేయాలి; మీరు సులభంగా పట్టు వదిలేస్తారు, ఏదైనా సాధించాలంటే అది కాదు మోస్తరు. నేను అడుక్కున్నాను నన్ను కూడా రా నివ్వండి అని—నన్ను రానిస్తే అతనిని ఒప్పించి ఉండును —నాకు బాగా తెలుసును, ఎంత జర్మన్ అయినా కేవలం మనిషి కాక పోడు కదా! రండి వెళదాము, నేను కూడా వస్తాను. మీరు రాకపోతే నేను ఒక్కర్తె నే వెళతాను.

ఆటో

ఏమీ ప్రయోజనం లేదు—మనకు దర్శనమైనా ఇవ్వడు.

ఇజెబెల్

చెప్ప గలిగినదంతా చెప్పారూ— జర్మనీలో మీ మాట చెల్లుతుందనీ, మీవాళ్లంతా చాలా ధనవం తులూ, పెద్దపెద్ద పదవులలో ఉన్నారనీ నాతో మా టిమాటికీ చెపుతూఉండే వారు, అవన్నీ అన్నారా అతని

ముందర? జడిపించాలి, గాభరాపెట్టేయాలి, మా మాట వినకపోతే ఏమిటి చేసిపోతారో అనిపించేటట్టు ఎంతపనైనా చేయాలి.

ఆటో

జడిపించడమా! నీకు బోధ పడడం లేదు. సంగతీ సందర్భమూ నీకేమీ తెలియదు. 'కోపం వస్తూ ఉంది, మరి వినను' అని అతను అనేటంత వరకూ చెప్పాను... ఇంకా అంతా నీతో చెప్పలేదు, మరీ ఘోరమైన సంగతి ఒకటి ఉన్నది.

ఇజెబెల్

మరీ ఘోరమా! దేనికంటే ఘోరం? చావుకంటే ఉండే ఘోరం ఏమిటి?

ఆటో

ఉంది ఒకటి, అది కనిపెట్టాడు అతను. కాని అతనిది దోషం కాదేమో! మాఅందరి లాగే అతను కూడా యుద్ధం అనేరాక్షసు దగ్గిర బానిస, సేనా పద్ధతులు దాటి ఒక్క అడుగు వేయలేదు. ఆ రెండో లెఫ్టెనెంట్ అంటే ఇష్టపడేటట్టు నేనంటే ఇష్టపడడు— మా జర్మన్ సంఘంలో వాళ్ల తరగతి వేరు, నాతరగతి వేరు. అయితే

నాకు అపకారం కోరుతున్నాడని అనను. నేనంటే అట్టే స్నేహం లేదు, గాని నేటివరకూ నాకు ఏమీ అన్యాయం మాత్రం చేయలేదు. చెడ్డవాడు కాడు, మా ఆఫీసర్లలో మిక్కిలి సాధువైన వాళ్ళల్లో, దయగలవాళ్ళల్లో ఇతనొకడు. కాని నన్ను ఇప్పుడు చేయమంటూ ఉన్నది మాత్రం అతి ఘోరమైనది.

ఇజెబెల్

ఏమిటది, ఏమిటి? మనము జడిసేది ఇక మరేమీ లేదే! ఇప్పటి వరకూ జరిగిన దాని కంటే ఎక్కువ మరేమి జరగ గలదు? ఒక్కమాటు చంపేడానికి బదులుగా, పూర్వంలాగు మెల్లిమెల్లిగా చంపే పద్ధతి పెడతాడా ఏమిటి? లేక మరి కొంతమంది కావాలా బలిగా? మా నాన్న చాలడూ? ఆయన ప్రాణంకంటే విలువగలది ఎక్కడా దొరకదు కదా? మనము కూడా కావాలా ఏమిటి అతనికి? అయితే మరీ మంచిది; అందరము కలిసి కులాసాగా చచ్చిపోదాము—ఇటువంటిది జరుగుతున్నప్పుడు ఎందుకూ మనము బ్రతికిఉండడం!

ఆటో

మరి కొంత మందిని చంపుదామని కాదు అతన్ని

కోరేది. నేను నా నోటితో... అబ్బ, చెప్పలేను, నీతో చెప్పడానికి ధైర్యం చాలదు.

ఇజెబెల్

ఏమిటి ఆ కోరేది? చెప్పండి,— మాట్లాడరేమి... ఏమిటిఆదాచడం!... ఇప్పుడు అవబోయే దాని కంటే ఘోరమైనది ఏమిటి చెప్పగలరు? నాన్నను వదులుకున్నాక ఇంకేమీ మిగలదే వదులుకోడానికి!

మేజిస్ట్రేటు

ఏమిటది ఆటో! అలాగు చేయడం చాలా క్రూరంగా ఉంది సుమా! సగం చెప్పి సగం చెప్పకుండా, ముళ్ల కంచ మీద నిలబెట్టి ఉంచేసి నట్టుగా! మతిపోయినట్టు అయిపోతూ ఉంది కనబడడం లేదూ! చెప్పేదేదో చెప్పేయి, తక్షణం చెప్పేయి—ఇప్పుడు మాకు తెలిసిఉన్న దానికంటే భయంకరమైనదేదీ చెప్పలేవు కదా!

ఆటో

అయితే చెపుతాను వినండి. (మేజిస్ట్రేటుగారి వైపు చూస్తూ) "పెళ్ళండి" అని నా నోటితో నేను సిపాయీ

లకు ఆర్డరు ఇచ్చి మిమ్మల్ని చంపించాలట—ఇదీ మా మేజరుగారు అనేమాట, అనగా అతని ఆజ్ఞ.

ఇజేబెల్

ఎవరికి చెప్పాలి ? సిపాయీలకా ! మా నాన్నను చంపవలసిన సిపాయిలకా !

ఆటో

అవును.

ఫ్లారిస్

దగుల్ బాజీ, బద్ మాష్ !

ఇజేబెల్

మీరా ? ఏమని చెప్పాలి? మీరు చెప్పాలి ? అభ్బే ఉత్తమాట ! అబద్ధం ! అంత ధైర్యంచేయలేదు !...అయితే మీ మనస్సులో ఉండేమాట నోటితో చెప్పలేదూ ! ...మీరు తిరగబడ లేదూ ! కమ్చీ పుచ్చుకొని మొఖం మీద కొట్టలేదూ ! కత్తి మెడమీద వెయ్యలేదూ !... అభ్బే, నేను నమ్మను. ఇటువంటిది ఎన్నడూ ఏయుద్ధంలోనూ జరగలేదు. నమ్మదగినమాట కాదు...అభ్బే అతను నిజంగా అన్నమాట కాదు... మిమ్మల్ని పరీక్ష చేశాడ్కే.

మీకు సంబంధించిన విషయాల్లో ఎంత దూరం వెళ్ల గలడో చూసుకుందామని అన్న మాట. అతనికి మాత్రం తెలియదూ ఎవ్వడూ అటువంటి పని చేయడానికి ఒప్పు కోడుఅని, మనిషన్నవాడు, ఎంత జర్మన్ అయినా సరే, ఎవ్వడూ చేయలేదు అని... అయితే దానికి మీరేమి జబాబు చెప్పారు? ఇప్పటికి తెలిసి ఉంటుంది, మీరు చేసే పని ఏదో, చేయని పని ఏదో! అదృష్టం వంకరయి జర్మనీలో పుట్టారు గాని మీరు ఆదేశస్థుల మోస్తరు కాదు అని బోధపడి ఉంటుంది.

ఆటో

దీనిలో ఉన్న గొప్ప చిక్కు ఏమిటంటే అతని దగ్గిర ఇప్పుడు ఉన్నవాళ్లలో పెద్దపని చేస్తూ ఉన్నది నేనొక్క జ్జే. పద్ధతిప్రకారం నాచేతనే చేయించాలి. ఇంకొక లాగు చేయలేదు.

ఇజెబెల్

ఇంకొకలాగు చేయలేదూ!...ఎంత సాహసం మీది! అది నాతో చెపుతున్నారా మంచిదే అని ఒప్పుకున్న వాళ్లు చెప్పినట్టుగా! ...అయితే మీరు ఏమి అన్నారు? ఏమి చేయబోతున్నారు?

ఆటో

అది ఎప్పటికీ నేను చేయలేని పని అని చెప్పాను.

ఇజెబెల్

అన్న, ఆమాత్రమైనా చేశారు ఆఖరికి. మీకు తగినమాట మీనోటివెంట వినడం ఇదే మొదటి మారు. నేను పెళ్లాడిన పురుషుడు ఆడదగిన మాట ఇది ఒక్కటే. ... అంటే ఏమన్నాడు మీ మేజర్ ?—నోరు మూసుకొని ఊరుకున్నాడా ?

ఆటో

ఆలోచించుకోడానికి ఏడు ఘంటల వరకూ నాకు వ్యవధి ఇస్తానన్నాడు. సరిగా ఏడు ఘంటలకు నా సిపాయిలను తీసుకొని గుర్రపుసాల వెనక మైదానంలోకి వెళ్లకపోతే, నన్ను పట్టుకొని తీసుకుపోయి మీనాన్నగారి పక్కను ఆగోడ యెదుట నిలబెట్టి మా ఇద్దరినీ తానే కొట్టిస్తానన్నాడు.

ఇజెబెల్

ప్రశస్తమైన పని. నేను వచ్చి మీ ఇద్దరి మధ్య నిలబడతాను. మూడు పరసలు పేలించమందాము,

అంతాపూర్తి అయిపోతుంది. బ్రతికి ఉండడం మరి సాధ్యంకాదు.

ఫ్లారిస్

నేను కూడా వస్తాను.

ఇజెబెల్

అటువంటివాణ్ణి "చెడ్డవాడు కాదు" అని కదూ అన్నారు— మీ అధికార్లలో మిక్కిలి "సాధువు" "దయ గలవాడు" అని కదూ అన్నారు!

ఆటో

జరుగుతున్నది యుద్ధం—అది మరిచిపోకు.

ఇజెబెల్

యుద్ధం ప్రారంభించినది ఎవరు?

ఆటో

మీకూ మాకూ జరుగుతున్న యుద్ధం ప్రారంభించినది మీరు. మీ మీద యుద్ధానికి బయలుదేరక తప్పింది కాదు అని తెలిసినప్పుడు మా దేశంలో అనేక మంది విచారించారు. గాని యుద్ధం కావాలని మీరు అంత

కోరుతూ ఉన్నప్పుడు మేము ఏమిచేయగలము? కేవలం స్నేహితులు వెళ్లినట్టుగా మీ దేశం గుండా వెళ్లనియ్యమని ఎటువంటి విరోధభావము లేకుండా మా సైన్యం మనుష్యులు మిమ్మల్ని వేడుకున్నప్పుడు వాళ్లను అటకాయించిన ఆనాడు మీ అందరికీ అతి ప్రియమైన మీ రాజు చేసిన కార్యం మహాఘనమైన కార్యం కదూ!

మేజిస్ట్రేటు

ఆగు, ఆగు, మా రాజుగారు కోరినది మా దేశంలో ప్రతి వాడూ కోరినదే. తిరిగీ రేపే ఈ అవస్థ వస్తే సరిగా ఈలాగే చేస్తాము; దేశాని కోసము మావాళ్లు ఎంత మంది ప్రాణాలు విడిచిపెట్టుకో వలసివచ్చినా ఈ చచ్చిపడి ఉన్నవాళ్ల మధ్యా ఈ, కూలిపోయిన ఇళ్ల మధ్యా నిలుచొని ఇప్పటిలాగే అంతా చేస్తూ ఉంటాము.

ఫ్లారిస్

మీ కైజర్‌తో చెప్పు ఆ మాట. అదికొంచం జీర్ణం చేసుకుంటే బాగు పడతాడు.

ఆటో

(జడిపిస్తూ) జాగ్రత్త! చూసుకు మరీ మాట్లాడు!

మేజిస్ట్రేటు

చాలు, ఇక చాలించండి పిచ్చివాళ్లలాగు ఈ మాట లన్నీ ! అర్థం‌ఉండే మాటలు కొంచెం ఆడుకుందాము పదండి. అంత ఒళ్లు మరిచిపో కూడదు. మీ మేజర్ దుర్మార్గుడు అను—మూర్ఖుడు అను—క్రూరుడు అను—ఏదనూ ఒప్పుకుంటాను, గాని అతను ఇప్పుడు చేస్తూ ఉన్న దానిలో తప్పుఏమీ లేదు. పద్ధతి ప్రకారం నడవక వీలులేదు; ఆ ఉద్యోగంలో ఉన్నతరవాత తను ఇప్పుడు చేస్తూ ఉన్నట్టు తప్ప ఇంకొక మోస్తరు చేయడానికి వీలు లేదు...అయినప్పటికీ ఆటో, నిన్ను ఒక్కసంగతి అడుగుతాను—అతను ఒక మాటు నిశ్చయం చేసుకుంటే ఏమివచ్చినా, ఆ విషయం గురించి తిరిగి ఆలోచించడన్న మాట నిజమే ? ఆఖరు క్షణం వచ్చేసరికి తరుచుగా అందరికీ బుద్ధి మారిపోతూ ఉంటుందే ! ఎంత మొండి పట్టు పట్టే వాడైనా చివరకు కొంచం ఆలోచించక మానడే !

ఆటో

పదేళ్లకు పైగా అతనిని నే నెరుగుదును, గాని నాకు తెలిసినంత వరకు ఏమిటంటే, నిశ్చయించుకున్న దేదో అక్షరాలా చేసి తీరుతాడు.

మే' స్ట్రీటు

సార్జంటుకు అప్పచెప్పలేడా ఇప్పుడు నిన్ను చేయమన్న పని ?

ఆటో

నేనకు సంబంధించిన విషయాల్లో అతనికి కావలసినదంతా "పద్ధతి" "పద్ధతి"...ఇంకొక సంగతి, మీతో ఇందాకా అన్నాను నామీద ఎటువంటి కోపమూ లేదని, అది మాటల ధోరణిలో వచ్చేసిన మాట. తిరిగి ఆలోచించిచూసుకుంటే నాకు అంత నమ్మకం లేదు. నేననే సరికి కొంచెం అయిష్టం, ద్వేషం అప్పుడప్పుడు కనిపెడుతూ వచ్చాను. దానికి కారణం ఫలానా అని నిశ్చయంగా చెప్పలేను. గాని ఒకటి అయి ఉండవచ్చును—మనది మహాగొప్పవంశం అని సంతోషిస్తూ డబ్బు లేకుండా బాధపడే అవస్థ అతనిది; అటువంటి గొప్ప లేక పోయినా ఐశ్వర్యం అనుభవిస్తూ ఉన్న అవస్థ నాది; కింది వాణ్ణి నేను, వాళ్లది మీది తరగతి. అందుచేత నన్ను చూస్తే ఆయనకు కష్టంగా ఉండవచ్చును. లేక ఇది నా భార్య దేశం గనుక ఈ దేశస్థులంటే నాకు చాలా అభిమానం అని అనుమానిస్తూ ఉండవచ్చును. ఈ రెండూ కూడా కాక ఇంకే

మైనా కారణాలు ఉంటే ఉండవచ్చును. వాటి వేటితో నాకు పనిలేదు. గాని ఒక్కసంగతి మాత్రం నిజం. నేను చేసేదానిలో ఏదైనా లోపం కనబడితే అతనికి ఎటువంటి విచారమూ ఉండదు, సందు దొరికితే నాసంగతి కనుక్కుందామని చూస్తున్నాడు. ఆ పరిశీ మూలంగా మా సిపాయిలందరికీ జర్మన్ నిబంధనలు అంటే ఏమిటో తెలియ జేస్తాడు.

మే'స్ట్రీటు

ఆ కొట్టేటప్పుడు అనవలసిన మాట నీకు బదులుగా నన్నే అననివ్వమని నేను ప్రతిమాలుకుంటే ?

ఆటో

నేను అదికూడా, అన్నాను...వీలులేదు అని ఖండితంగా చెప్పేశాడు. పెద్దువారి చేసే మీలాంటి ద్రోహి ఆ గౌరవానికి అర్హుడు కాడని అన్నాడు. అంత స్పష్టంగా తెలుస్తూఉంటే దానిలో ఆలోచన ఎందుకు అన్నట్టు మాట్లాడాడు.

ఫ్లారిస్

ద్రోహా ?

మే'స్ట్రీటు

అవును ఫ్లారిస్, జర్మనీ లాభం కోసం దేశ ద్రోహం చేయని ఏ దేశస్థులనైనా వాళ్లు ద్రోహులంటారు.

ఆటో

ఏ పద్ధతిపట్టి చూసినా కూడని పని అని అన్నాడు. అందుచేత మరి చెప్పి ప్రయోజనం లేదు.

మే'స్ట్రీటు

సరే, అయితే ఏమి చేయాలనుకుంటున్నావు ?

ఆటో

ఇజెబెల్ ఏమిటి నిశ్చయిస్తే అది.

మే'స్ట్రీటు

ఏమిటి చేయమంటావు ఇజెబెల్ ?

ఇజెబెల్

నీ 'ఇష్టంవచ్చిన పని చేసుకో, నేను చేయను పో' అనడం.

ఫ్లారిస్

కాక మరేమిటి !

మే'స్త్రీటు

నీవు చేయననడంవల్ల కాబోయే దేదైనా మారుతుందా ?

ఆటో

ఏమీ మారదు—నాకు బాగా తెలుసును—అంటున్నానని క్షమించండి.

మే'స్త్రీటు

అంతటితో ఆగదు; ఏమౌతుందో పూర్తిగా నీకు తెలియదేమో ఇజెబెల్ ! అతన్ని తక్షణం పట్టుకొని ఎరెస్టు చేయించి నాపక్కను నిలబెట్టి అతన్ని కూడా నాతో పాటు కొట్టేస్తారు. అంతేకదూ, ఆటో ?

ఆటో

ఏమీ సందేహం లేదు.

మే'స్త్రీటు

అదేనా నీవు కోరేది ఇజెబెల్ ? నాతోపాటు అతను కూడా వాళ్లకు బలి కావాలి అనా ?

ఇజెబెల్

నీతోపాటే కాదు, నాతోపాటు కూడాను.

మేజిస్ట్రేటు

మాతో పాటు నిన్ను చావనిస్తారని నాకు అంత నమ్మకం లేదు.

ఇజెబెల్

ఆడది అని విడిచిపెట్టే వాళ్లు కారు వాళ్లు. విడిచి పెడితే అటువంటి పని చేయడం ఇదే మొదటి మారు అన్నమాట. గాని ఆ భయం మీకక్కర లేదు. ఇంతకూ దానితో మీకేమీ సంబంధం లేదు. అదంతా నా ఒక్కర్తెతోనే సంబంధించినది, దాని విషయమై ఏమీ వాదించ నక్కర లేదు.

మేజిస్ట్రేటు

నువ్వు ఏమంటావు, ఆటో ?

ఆటో

నా వంతు నేను ఒప్పుకుంటాను, అనగా ఆపని నేను చేయను అని చెపుతాను. అంతే నేను ఒప్పుకుండేది, దానివల్ల ఇజెబెల్‌కు మాత్రం చావు ప్రాప్తించ కూడదు.

మేజిస్ట్రేటు

ఆటో, ఆ ఆజ్ఞ నిన్ను తిరస్కరించమని చెప్పడంలో

ఇజెబెల్ చేస్తున్నదేమిటంటే, నిన్ను ఆ తుపాకీల నోటికి తీసుకువెళ్లి అప్పచెప్పడం. అటుపైని తానుకూడా మరి బ్రతికి ఉండనని నిశ్చయించుకుంటేనే తప్ప అటువంటి పని చేయడానికి ఆమెకు అధికారం లేదు. తాను కూడా చచ్చిపోతానని చెప్పి ఇంకొకరిని మృత్యువు నోటికి అప్పచెప్పి—ఇజెబెల్ నీవు చేసేది అదే కదా!—అతను చచ్చిపోయిన తరవాత తాను చావకుండా కూర్చోవడం మిక్కిలి నీచమైన పని, ద్రోహం అని కూడా చెప్పవచ్చును. మీరందరూ బాగా ఆలోచించుకోండి. నా ముందర ఒప్పుకోవడం ప్రమాణం చేయడమన్న మాట; అది సామాన్యమయిన పని కాదు, మరి వెనక్కు వెళ్లడానికి వీలుండదు.

ఇజెబెల్

ఆహా—నేను ప్రమాణం చేయడానికి వెనక్కు తీయను; అదంతా బాగా ఆలోచించుకున్నాను.

మేజిస్ట్రేటు

అనగా, ఆటో ఒక ఘంటలోగా చచ్చిపోతాడు—నీవు కోరేది అదేనా?

ఇజబెల్

నేను కోరేదంతా అదే, సమంగా అదే.

మేజిస్ట్రేటు

నీకు కూడా సమ్మతమేనా, ఆటో?

ఆటో

సమ్మతమే, ఇజబెల్ కోరిక గనుక.

(కొంచెం సేపు అందరూ ఊరుకుంటారు.)

మేజిస్ట్రేటు

నా మనస్సు ఆనందంతో నిండిపోతూ ఉంది. ఒకరికొకరు తగినవాళ్లే మీరిద్దరూ. మీ ఇద్దరికీ నామీద గల ప్రేమకూ, మీ ఇద్దరిలో ఒకరిమీద ఒకరికి గల ప్రేమకు వేరే నిదర్శనం నాకక్కరలేదు. మాటలలో కాకుండా క్రియామూలంగా కూడా స్వార్థత్యాగం స్పష్టపరచినంత పని మీరు చేశారు. గనుక మనము ఇక ఎటువంటి భయమూ సంకోచమూ లేకుండా మాట్లాడవచ్చును. దీనంతటిలోనూ అవసరమున్నదీ, తప్పనిదీ ఒక్కచావు మాత్రమే; అది నా చావు. మీరు చావడమూ చావక పోవడమూ అనేది మీ చేతిలోని

మాట—అనగా, జరగకూడదన్న మాట. ఇజెబెల్, తల్లీ, నాకే ఏదో జబ్బుచేసి ఇంకొక్క క్షణంలో చచ్చిపోతా నేమో అన్నస్థితిలో ఉన్నాననుకో—అటువంటి సమయంలో నా మనస్సులో ఉండేది విని నాకోరిక నెరవేర్చక పోవు కదా. ఈలాగు నేను నీ ముందర నిల్చొని ఉన్నా ఇంకొక ఘడియలో చచ్చిపోయే మంచంమీద పడిఉన్న జబ్బుమనిషికిందే లెక్క కదా! (గడియారం ఆరు ఘంటలు కొడుతుంది.) అదుగో! ఆరు ఘంటలు! ఎంత దగ్గిర పడ్డదో చూడు. అయినా చచ్చిపోయే ముందర అందరికీ అయేలాగు నాకు మనస్సు మబ్బుకమ్మేయడం లేదు, జ్ఞానమూ, మనస్సుకుండే పటుత్వమూ, ఏదీ కొంచమైనా తగ్గలేదు. అందుచేత నేను కోరబోయే కోరిక మరీ మన్నించ దగినది. చచ్చిపోయేవాళ్ల కోరిక నెరవేర్చినట్టుగా భక్తి పూర్వకంగా నా కోరిక చెల్లిస్తానని ఒప్పుకుంటావ్వా, ఇజెబెల్ ?

ఇజెబెల్

నీవు అడగబోయే దేమిటో నాకు తెలుసును. తనకు తండ్రితో సమానుడైనటువంటిన్నీ, నాకు తండ్రి అయి

నటువంటివన్నీ నిన్ను చంపమని ఆయనతో చెపుతానని, నీకు మాట ఇవ్వడం నాకు సాధ్యం కానిపని.

మే'స్ట్రీటు

ఇజెబెల్, ఇటువంటప్పుడు మాటలతో ఆటలాడ కూడదు; ఆలాగు ఆటలాడే మాటలు ఎప్పటికీ తన భావాన్ని తెలియపరచకపోవడమే కాకుండా లోపున ఉండే నిజాన్ని తారుమారుచేస్తాయి. ఆటో తన ప్రాణాన్ని ఇచ్చి సాధ్యమైతే నా ప్రాణం నిలపడానికి సిద్ధంగా ఉన్నాడు. నా చావుకుండే కారణాలతో తనకు ఎటువంటి సంబంధం ఉన్నా కలిగే దుఃఖం లేకుండా ఉండాలని తనప్రాణాన్ని ఇచ్చేయడానికి కూడా సిద్ధంగా ఉన్నాడు. నిజం అంటే ఇదే. ఆ నిజం ఆటోద్వారా మనకు తెలుస్తూ ఉంది. అతను మనకోసమని చేయపూనుకొన్న స్వార్థత్యాగానికి అర్హులము అని మనము కనపరచడానికి ఒక్కటే మార్గముంది. అది ఏమిటంటే అతను చేయ తలచుకొన్న ప్రాణార్పణ మనము అంగీకరించక పోవడమే.

ఇజెబెల్

ఆ ప్రాణార్పణ అంగీకరించకపోతే నేను నీ కొమార్తె పదవికి తగను.

మే’ స్ట్రీటు

మాటలు, మాటలు, ఉత్తమాటలు! చెప్పవలసిన దేదో తెలియజేయని మాటలకు ఇప్పుడు వ్యవధి లేదు. వేళ పరుగెత్తుతూ ఉంది, ఉండేవి కొద్ది నిమిషాలు మాత్రమే. నీకు నచ్చచెప్పనిదే చచ్చిపోవడానికి నా మనస్సు ఒప్పుకోకుండా ఉంది. ఇజెబెల్, ఇప్పుడు ఆటో అవస్థ, మర చక్రాలకుండే పళ్లమధ్య చిక్కుకున్న వాడి అవస్థ, తప్పించుకొని పైకి రాలేడు, ఆమాట నీకు తెలుసును. ఈ ఒక్కమాటా జ్ఞాపకం ఉంచుకుంటే అతనిని ఎంతమాత్రం నిందించలేము. నన్ను కొట్టబోయే తుపాకులది ఎంత తప్పో, ఆటో చేతనున్న ఆ కత్తిది ఎంత తప్పో, ఆటోదీ అంతే తప్పు. లేనిది ఉన్నట్టుగా చెప్పే మాటలు విడిచిపెట్టి, ఉన్నది ఉన్నట్టుగా తెలుసుకోవాలి. అతను మెడ్డివేయడం వల్ల నాకు వచ్చే చావు ఒక రోజు—పోనీ ఒక ఘుంట—అయినా వెనక్కు పెట్టగలిగితే నీవు అనేమాట నాకు అర్థం అవుతుంది. గాని ఒక మూడు నిమిషాలపాటైనా వెనక్కు పెట్టలేము. ఆ ఆఖరకు అనేమాట ఆటో అన్నా ఇంకెవరన్నా నాకు తగిలే ఆ పది పన్నెండు దెబ్బలవల్ల కలిగే బాధ ఒక్కటే.

ఇజెబెల్

చాలు నాన్నా, చాలు.

మే'స్ట్రీటు

చాలదు, ఏమీ చాలదు. నీవు ఇంకా ఒప్పుకోలేదు. ఒప్పుకున్నట్టు నాకు మాట ఇవ్వలేదు.

ఇజెబెల్

నేను ఒప్పుకోను.

ఫ్లారిస్

అక్కా!

ఇజెబెల్

ఏమిటమ్మా తమ్ముడూ?

ఫ్లారిస్

(పరుగెత్తుకొని వెళ్లి అక్కను కౌగలించుకొని) లేదు లేదు, నాకేమీ తెలియదు.

మే'స్ట్రీటు

నేను చేయవలసినది నేను చేశాను. అది మంచిదని నీవు ఒప్పుకున్నావు. నా ప్రాణాలను నేను సమర్పింపు

కున్నాను. ఇంత సులభంగా చేయగలనని ఊహించడాని కైనా తగిన సాహసం నాకు లేదనుకున్నాను. ఇంత ధైర్యం నాకు ఉన్నదని నే నెప్పుడూ అనుకో లేదు. ఐనా నేను ఒక పెద్ద ధీరుణ్ణి గాని వీరుణ్ణి గాని కాను. నేను ఒకసామాన్యుణ్ణి—సామాన్యులలాగు నే నేను ఇప్పుడు చేయబోయేలాంటి పని చేయడానికి సిద్ధంగా ఉండనివాణ్ణి. నన్ను ఇంతకు విస్తారం చేయమని అడగడం ధర్మం కాదు—బలానికి మితి ఉంది కదా ! దుఃఖానికి ఓర్చిఉండడం నాకు అలవాటు లేదు. గొప్ప దురదృష్టం వచ్చి మీాద పడితే ధైర్యంగా నిలబడి ఎప్పుడూ ఉండలేదు. నాకే దురవస్థ వస్తే కొంతవరకు సహించి ఉండగలను గాని ఇంకొకరు బాధపడుతూ ఉంటే చూసి ఉండలేను. అందరి ప్రాణాలు కాపాడ్డానికి నా ప్రాణాలు బలిగా ఇస్తూఉన్నప్పుడు నేను కాపాడే ప్రాణాలన్నిటిలో నాకు మిక్కిలి విలువైనది నా ప్రాణంతో కూడా పోతుందంటే మాత్రం చివరవరకూ మనస్సు నిలుపుకొని ఉండలేనన నాకు అప్పుడే తెలుస్తూ ఉంది. ఇప్పటికీ నన్ను బాధించగలిగే ఆ ఒక్క దుఃఖం మాత్రం నాకు రానివ్వకండి. మాట గ్రహించండి. నాకు సహా

యం చేయండి. సహాయం చేయడానికి బదులుగా మీ రిద్దరూ కలిసి నా బాధ మరింత దుస్సహం చేస్తున్నారు. శత్రువు ఎదుట నిలబడి ఉండవలసివచ్చినప్పుడు మీ తండ్రి తలఎత్తుకొని ధైర్యంగా నిలబడవలెనని మీ కోరిక కాదూ? చావు నాకే అంటే భయం లేకపోయింది, గాని మీకూ అంటే భరించలేను. నాకుండే బలం అంతా వినియోగించే అవసరం ఒక్క క్షణంలో వస్తుంది; నా బలం తగ్గించకండి. నా ప్రాణాన్ని దానం చేసేశాను; గాని మీ ఇద్దరి ప్రాణాలూ దానం చేయలేదు. మీరు కూడా కలిస్తే చావు రెండింతలవుతుంది, బాధ మూడింతలు. మీరిద్దరూ కూడా నా పక్కను నిలబడి గుండు దెబ్బ తింటానంటే నేను ఇప్పటి వరకూ తెచ్చుకో గలిగిన ధైర్యం చాలదు.

ఇజెబెల్

(వెక్కివెక్కి ఏడుస్తూ, నాన్న దగ్గిరికి పరుగెత్తుతుంది; నాన్న రెండు చేతులతో పట్టుకుంటాడు.) నాన్నా!

మేస్త్రీటు

నాకోసం కళ్ల నీరు పెట్టుకుంటావనే అనుకున్నాను.

ఇకముందు సబబుగా ఉంటావనీ, నేను చెప్పేదానికి అడ్డు చెప్పవనీ దానివల్ల నాకు తెలుస్తున్నది.

ఇజెబెల్

నేను చేయలేను, చేయలేను, నీవు చెప్పినట్టు ఎన్నటికీ చేయలేను.

మే' స్ట్రీటు

నీవు చేయక తప్పదు. మరి వ్యవధి లేదు. నేను బ్రతికి ఉండే దానిలో ఆఖరి క్షణాలు నాలుగూ చావు కంటే ఎక్కువ బాధగా చేసేస్తున్నావు.

ఇజెబెల్

తప్పించుకోడానికి ఇంకా దారి ఉన్నది. మనము ఎక్కడికైనా పారిపోవచ్చును.

మే' స్ట్రీటు

పారిపో' డమా ?...ఎక్కడికి ?...ఏలాగు ?...ఇంటి చుట్టూ ఫారా !...

ఇజెబెల్

'ఇంటి చుట్టూ ఫారాఉన్న సిపాయిలకు అధికారి

ఎవరో తెలియదూ ? ఆయన అంత మాత్రం మాట అంటే చాలును.

మే'స్ట్రీటు

నే నెక్కడికీ పారిపోకుండా ఉండే పూచీ ఆటోది. నేను పారిపోతే నాస్థానే ఆటో తుపాకుల ముందర నిలుచోవాలన్న మాట.

ఇజెబెల్

ఆయన కూడా పారిపోవస్తారు.

మే'స్ట్రీటు

పారిపోవడమా ! ఇంకా ఒక ఫర్లాంగైనా వెళ్లక ముందే తిరిగి ఇద్దరమూ వాళ్ల చేతిలో పడడం ! ఘోర మేమో తప్పదు. చచ్చే చావు మరింత అసహ్యంగా ఉంటుంది. నేను ఒక వేళ తప్పించుకొని పారిపోగలిగినా దానికిగాను చాలామంది ప్రాణాలు ఇచ్చుకోవలసి వస్తుంది. తప్పించుకోడానికి ఉన్న దార్లు అన్నిటిలో ఏవిధంగా చూసినా కూడనిది ఇదేను. లేదమ్మా ఇజె బెల్—ఇంకొక మార్గం లేదు. నిర్ణయం అయిపోయి ఉన్నాను. మరి ఆశ లేదు. మీకు మరి నాన్న లేడనే అనుకో, నా రోజులు తుద ముట్టాయి; బ్రతికి ఉండదగ్గిన

రోజులు మరి లేదు. ఇంకా ముందుకు సుఖం ఉంటూ ఉండగా విడిచిపెట్టి పోతూఉండలేదే! నెలల తరబడి, మంచంపట్టి, బాధ పడిపడి, చావడం కంటే అకస్మాత్తుగా ఒక్కమారు ఏవిచారమూ ఏబాధా లేకుండా ఇంత గౌరవంగా చావడమూ, ఆ చావువల్ల ఊళ్లో సగం మంది ప్రాణాలు కాపాడడమూ ఎంత అదృష్టం! మామూలు మోస్తరు చావు రాలేదని విచారించడం గాని, ఈ మోస్తరు చావు అంటే సంకోచించడం గాని ఉత్త పిచ్చి. నాకూ చావంటే భయం గానే ఉండేది. ఇప్పుడు కాబోయేటట్టు ఒకనాటి సాయింత్రం ఎప్పుడో అవుతుందని ఎవరైనా వచ్చి ఇంతకు ముందు నాతో చెప్పిఉంటే రోజూ ఆమాట జ్ఞాపకం వచ్చి బ్రతికిఉండడం చాలా కష్టం అయి ఉండును. ఇప్పుడో? దాని గురించి ఆలోచనే లేదు; నాకు రాబోయేది మామూలు మోస్తరు ఏదీకాదు, ఎప్పుడూ అనుకోని గొప్ప దురవస్థ అని బాగా ప్రయత్నిస్తేనే గాని మనస్సుకు తట్టకుండా ఉంది. దూరం నుంచి చూస్తే చావు ఏదో భయంకరమైన మహా పర్వతం లాగు కనబడుతుంది, వెనకనుండే దేదీ కనపడకుండా చేస్తూ. దగ్గిరికి వెళుతూ ఉన్న కొలదీ మనకు భయం

తగ్గుతూఉంటుంది; బాగా ముఖాముఖి అయేసరికి ఇంతేనా అనిపిస్తుంది.

ఇజెబెల్

చావు అటువంటిది అయినప్పుడు మేము కూడా నీతోనే వస్తాము.

మేజిస్ట్రేటు

ఆ అటువంటిది-కావడం నాకు— పెద్దవాణ్ణి అయిపోయినాను, ఏలాగైనా అట్టే రోజులు బ్రతకను గనుక. అంతేకాకుండా నాది అవసరమైన చావు. మీ చావులు ఇప్పుడు అవసరం లేనివి. మీకు జీవితం ఇప్పుడే ప్రారంభిస్తూ ఉంది. అందుచేత మీకూ నాకూ చావు వేరు వేరుగా కనబడాలి.

ఇజెబెల్

మాకు జీవితం ప్రారంభిస్తూ ఉందీ? ఆహా, మహా మంచి జీవితం కదూ, ఈలాగు ప్రారంభించేది!

మేజిస్ట్రేటు

మీ జీవితాలు ఏమయేది మీ చేతులలో ఉంది. కాని ఆ మాటలు చాలించుదాము! బ్రతిమాలుకు

న్నాను, అడుక్కున్నాను, వాదన చేశాను. వేళ అయి పోతూ ఉంది, అయిపోయింది. ఈ ఆఖరు నాలుగు క్షణాలూ మిమ్మల్ని అందరినీ దగ్గిర కూర్చోపెట్టుకొని మన స్సారా ఒక్కమారు కాగలించుకోడానికి బదులుగా వృథాగా పోట్లాడి పాడుచేసుకుంటున్నాను. నేను కోరి నది చేస్తారా చేయరా? 'అవును' 'కాదు' అని ఒక్క మాటలో చెప్పేయండి. ఆటోను అడుక్కుంటున్నాను. అతను మాట్లాడకుండా ఊరుకోవడం చూస్తే బోధప రుచుకున్నాడు అన్న మాట. ముందుకు నీకు బోధపడే మోస్తరుగా ఇప్పుడే అతను అన్నీ బోధపరుచు కుంటు న్నాడు. నేను అనుకుంటూఉన్నట్టే అతనూ అనుకుంటు న్నాడు. ఆలోచించి చూసుకుంటే అందరూ ఆలాగే అనుకొని తీరుతారు. ఇప్పుడు నా మాట విన్నందుకు ముందుకు ఎప్పుడో ఒకనాడు, బోధపడినప్పుడు, చాలా సంతోషిస్తావు. సరే ఇక ఆ మాటలన్నీ చాలిద్దాము. తొందరపడి ఏమీ అవకతవక పని చేయనివ్వకుండా కొంత బందోబస్తు చేస్తాను. లేకపోతే నువ్వు ఆఖరికి మరి భరించ లేవు. నిన్ను ఈ గదిలో పెట్టి తాళం వేసి ఆ తాళంచెవి ఆటోకి ఇస్తాను. అంతా ఆఖరు అయిపో యిన తరువాత నిన్ను బయటికి వదులుతారు.

ఇజెబెల్

నన్ను గదిలో పెట్టేస్తారా? ...నేను ఒప్పుకోను. ఎంతమాత్రం ఒప్పుకోను.

మేజిస్ట్రేటు

బలం ఉపయోగించి ఆటో నేనూ కలిసి నిన్ను గదిలో పెట్టవలసినంత మొద్దువారిని చేయవు, నాకు తెలుసును. ఆ లాగు చేశావంటే నాకు చాలా కష్టంగా ఉంటుంది సుమా! నా వేపు చూడు ఇజెబెల్! నీవల్ల నాకుండే బలమంతా పూర్తిగా పోతూఉంది. ఒక చావు కాదు నాకు వచ్చేది, పది చావులు. నిలబడలేకుండా ఉన్నాను చూడు. నా శక్తికి మించి పోయింది ఇదంతా, నేను మరి భరించలేను, కనబడుతూ ఉండడం లేదూ?

ఇజెబెల్

(వెక్కి వెక్కి ఏడుస్తూ, తండ్రి చేతులలో పడిపోతుంది.) నేనూ మరి భరించలేను... నీ ఇష్టము వచ్చిన పని—ఏది—చేయమంటే—అది—చేస్తాను...

మేజిస్ట్రేటు

ఇంత సేపటికి నా కూతురు, నిజంగా, నాది అయింది.

ఏదీ తల్లీ, నీ చెయ్యి నా కొకమారు ఇయ్యి. బాధా విచారమూ మరిచిపోయి ఒక్కమాటు ముద్దు పెట్టుకుంటాను. మీరిద్దరూ బ్రతికిఉంటారు. నాకు విడుదల అయిపోయినంత సంతోషంగా ఉంది. గాని చచ్చిపోతూ ఉన్నవాడికి మాట ఇచ్చారు, జ్ఞాపకం ఉంచుకోండి. ఇంకొక మాట అమ్మా, ఇజబెల్!—అంతా మరిచిపో అని నీతో చెప్పను—అది నీ చేతిలో మాట కాదు; ఆటోను క్షమించమని కూడా అడగను, క్షమించడానికి ఇందులో ఏమీ లేదు. నే నడిగేదంతా ఇదే—ఆటో అంటే ఎటువంటి అసహ్యమూ మనస్సులో చేరనివ్వకూడదు. ఇందులో కూడా నా మాట మన్నిస్తావా ?

ఇజబెల్

(మెల్లిగా, వినబడీవినబడనట్టుగా) ఆ—

మేస్త్రీటు

దగ్గిరికి రా ఆటో, నీ చెయ్యి ఏదీ? (ఆటో చెయ్యి పట్టుకొని ఇజబెల్ చేతిలో పెట్టబోతాడు.)

ఇజబెల్

(చటుక్కున వెనక్కుజరుగుతూ) వద్దు...ఇప్పుడువద్దు.

మే'స్త్రీటు

మన ఇద్దరికంటే కూడా అతనిని చూసి అందరూ జాలి పడాలి. ఈ మహాకష్టంలో ముఖ్యమైన భారం అతను మోస్తున్నాడు. అతని స్థానంలో నేనే ఉంటే, అది భరించే బలం నాకుంటుందా అని సందేహం. మనము అతనిని చూచి జాలిపడాలి. ఈ రోజువరకూ ఉన్నట్టుగానే అతనియడల నీకు ప్రేమ తిరిగి మెల్లి మెల్లిగా పుడుతుంది...బహుశా కొద్ది రోజులలోనే నువ్వు తల్లివి అవుతావు. చివరకు ఆ పుట్టబోయే బిడ్డ కూడా ఈ మహాదుఃఖానికి బలి కాగలదు సుమా! అది మాత్రం కాకుండా చూడాలి. అలాగు కావడం కంటే విచారకరమైన సంగతి ఉండదు. మొదట కొన్నాళ్ల వరకూ బ్రతుకంటే మహాకష్టంగా ఉంటుంది, అతిదుఃఖంగా ఉంటుంది. కొంత కాలం ఓర్చి ఉండు. మన లోనూ—అనగా నీలోనూ, నాలోనూ, అందరిలో నూ—ఈ ప్రపంచం లోనూ, ఈ విశ్వం అంతటిలోనూ ఉన్న జీవం చెప్పేదానిని వినయతతో విను. అది ఎప్పుడూ సరిఅయిన మాట చెపుతుంది, అది నడిచే దారి తిన్ననిది, అధి మిక్కిలి దాక్షిణ్యం కలది, అందరియడలా స్నేహ

భావం కలది, మరువవలసినది అతి త్వరగా మరచిపోతుంది. (గడియారం ఏడు ఘంటలు కొడుతుంది.) ఏడు ఘంటలు వినబడుతూఉంది, ఎవరో తలుపు కొడుతున్నారు. నా వేళ అయిపోయింది. మనను తీసుకు వెళ్లడానికి వచ్చారు ఆటో. ఆఖరిమాటు నిన్ను మనస్సారా, చేతులారా పట్టు కోనీ' ఇజబెల్. దా అమ్మా నా చేతులతో నిన్ను పట్టు కోనీ' ఫ్లారిస్. నువ్వు పెద్దవాడవుఅయినావు కదా, అక్కను చూసే పూచీ నీది. ఎంతో ప్రేమతో, ఎంతో ఆదరంతో ఒకరినొకరు చూసుకుంటూ కాలం గడిపాము. ...రా ఆటో, మనవల్ల వాళ్లకు ఆలస్యం కాకూడదు. (ద్వారం వైపు తిరుగుతాడు.)

ఇజబెల్

(తండ్రి కోటు గట్టిగా పట్టుకొని) వద్దు, వద్దు!... ఇప్పుడప్పుడే వద్దు...నేను భరించలేను...నీతో నేను వస్తాను.

మేజిస్ట్రేటు

(కోటు విడిపించుకొని) ఇక ఒక్క మాట అయినా కూడదు...ఇంతకంటే మరి భరించలేను...ఫ్లారిస్,అక్కయ్యను చూసుకో...(ఇజబెల్‌ను చేతితో తోసేసి

ఆటోతో కలిసి బయటికి వచ్చి, పైనుంచి తాళం వేస్తాడు. కొంచెం సేపు ఎవరూ ఏమీ చేయరు. ఇజేబెల్ నేలమీద పడిపోతుంది. వెక్కి వెక్కి ఏడుస్తుంది. ఫ్లారిస్ అక్కను ఎత్తి తనమీద చారవేసుకుంటాడు.)

ఫ్లారిస్

(ఒంటి మీద చెయ్యి వేసి దువ్వుతూ) అక్కా... అక్కా...ఏడవకు అక్కా...వాళ్ల పని పట్టిద్దాం, పని పట్టిద్దాం, పని పట్టిద్దాం...పని—

ఇజేబెల్

(సరుదుకొని, నాలుగు వైపులా చూసి, తటాలున లేచి, తలుపు దగ్గిరికి పరుగెత్తుతుంది.) లేదు లేదు, నేను ఒప్పుకోను, ఎంతమాత్రం ఒప్పుకోను!

ఫ్లారిస్

(పరుగెత్తి ఆమెను పట్టుకొని) ఏమిటి చేస్తున్నావు? ఏమిటి చేస్తావు?

ఇజేబెల్

నేను...నేను కేకలు వేస్తాను, అరుస్తాను, అతని కాళ్ల మీద పడతాను, అతని ముందర చచ్చిపోతాను...ఏమి

చెప్పగలము...చేయవలసిన ప్రయత్నాలు అనేకంగా ఉంటాయి. (తలుపు గట్టిగా కదిలిస్తుంది.) తాళం వేసేశారు! (కిటికీ దగ్గరకి పరుగెత్తుకొని వెళ్లి, తలుపుతీసి చూస్తుంది. ఎత్తుగా ఉండడం చేత భయంతో వెనక్కు తగ్గుతుంది. వెనకనే పరుగెత్తి వస్తూఉన్న ఫ్లారిస్ ఆమె నడుము పట్టుకొని గది మధ్యకు తీసుకు వస్తాడు.)

ఫ్లారిస్

చూశావా అక్కా, ఎంత ఎత్తుగా ఉందో !

ఇజెబెల్

(తలుపు దగ్గిరికి వెళ్లి మళ్లా గట్టిగా ఊంపుతుంది.) నేను తలుపు తీయలేను !...తీయలేను !...ఆహా నేను ఇప్పుడు అక్కడ ఉంటేనా !... ఆఖరి క్షణందాకా, ఎవరు చెప్పగలరు !...వెళ్లాలి, అక్కడికి వెళ్లాలి... (తుపాకుల బారు వినపడుతుంది. దిగులుపడి కాలు వెనక్కు వేస్తుంది.) అయిపోయింది, అయిపోయింది ! చంపేశారు...ప్రపంచం అంతటికీ విలువైన దానిని చంపేశారు !...నాకు మరి కనబడడు, నాకంటికి మరి కనబడడు. (జోగుతూ ఫ్లారిస్ సహాయంతో ఒక కుర్చీ దగ్గిరికి వెళ్లి ఆ కుర్చీమీద ముద్దఅయి పడిపోతుంది .కళ్లు పెద్దవిచేసి,

మతి లేనట్టుగా చూస్తూ ఉంటుంది. ఫ్లారిస్ రెండు చేతులతో అక్కను పట్టుకొని తన బుగ్గ అక్క బుగ్గ మీద పెట్టి "అక్కా, అక్కా, అక్కా" అని అతి ముద్దుగా అంటాడు. కొంచెంసేపు ఆలాగు ఉన్న తరవాత మేజరూ, ఆటో, వీరిద్దరూ తలుపుతీసుకొని లోపలికి వస్తారు.)

మేజర్

అమ్మా, ఆ తుపాకులతో కొట్టినప్పుడు ఆఖరికి అనవలసిన మాట ఆటోగారికి బదులుగా నేనే అని మీ నాన్నగారిని గౌరవించాను. మీ భర్తగారు చివరవరకూ పద్ధతులకు లొంగిఉంటానని కనపరచడమే నాకు కావలసినదంతా. ఇదుగో, మీకు తెచ్చి అప్పజెపుతున్నాను. దీని అంతటిలో, ఆయనను నిందించ వలసిన దేమీ లేదు. ఎటువంటి తప్పూ లేకుండా చాలా తృప్తికరంగా అంతా జరిగింది. మీ తండ్రిగారు అతి ధైర్యంతోనూ, ఆనందంతోనూ చనిపోయినారు... లెఫ్టెనెంటుగారూ, ఇక మీరు మీ భార్యదగ్గిరకి వెళ్లి...

ఇజెబెల్

(తటాలున లేచి నిలబడి) కూడదు!

వెళిపొండి మీరిద్దరూ!...వెళ్లండి!

ఆటో

అదేమిటి, ఇజెబెల్ ! నేనుకూడానా?...బోధపరుచు కోకుండా ఉన్నావు !

ఇజెబెల్

అంతా బోధ పరుచుకున్నాను...అంతా బోధపడ్డ ది—అతి విస్తారం బోధపడ్డది. బోధపరుచుకోని దెవరో తెలుసును.

ఆటో

(దగ్గిరికి వచ్చి) చూడు, ఇజెబెల్ !...

ఇజెబెల్

(వెనక్కు వెళిపోయి) ముట్టుకో నివ్వను...పైకి వెళి పోతే బాగుంటుంది....ఇక మరి—

ఫ్లారిస్

(కాలు కింద కొట్టి) మంచిపని! మంచిపని!...అక్కా నన్ను ముద్దు పెట్టుకో, నన్ను ముద్దు పెట్టుకోసీ!...ఇక క్షనము ఇద్దరమే, నువ్వూ నేనూ.

మేజర్

(ఆటోతో) సరే, వాళ్లమాట మన కెందుకు; మీరు నాకు అవసరం. అంతా స్వాధీనం చేసుకొంటూ మన వాళ్లు ఈ సమీపానికి వచ్చేశారట...మీరు చేయవలసినది మీరు చేశారు...వీళ్ల సంగతి నాకు బోధపడడం లేదు. ఈ దేశంలో అందరికీ ఈలాగే, ఒక మోస్తరు పిచ్చి.

(తెర.)

చెన్నపురి: వావిళ్లప్రెస్సున ముద్రితము.—1928.

# విశ్వభారతి గ్రంథమాల

(తెలుగు)

రవీంద్రనాథ ఠాకూర్ గారి

| | | |
|---|---|---|
| గృహప్రవేశం | (నాటకం) | ౦-౧౨-౦ |
| పోస్టాఫీస్ | ,, | ౧-౧౦-౦ |
| వేశ్యపూజ | ,, | ౦-౧౦-౦ |
| ఇంటా బయటా | (న వ ల) | ౩-౦-౦ |

మేతర్‌లింక్ గారి

| | |
|---|---|
| స్టిల్ మాంద్ మేజస్ట్రేట్ | ౧-౧-౦ |

రవీంద్రనాథ ఠాకూర్ గారి ఇతర గ్రంథాలూ, జగద్విఖ్యాతులైన ఇతరదేశపు కవులు రచించిన కొన్ని గ్రంథాలూ తర్జుమా అవుతున్నది. త్వరలో అచ్చవుతవి.


విశ్వభారతి ఏజన్సీ

౩౨౮ తిరువత్తూరు హైరోడ్

తండయార్‌పేట మద్రాసు.